


# వేదాలలో వర్షేష్టి విజ్ఞానం

## వర్షేష్టిసూక్తం - సరళార్థ సహితం

### బృహత్ యజ్ఞవిధి పూర్వకం

మంత్రకర్త : 'ఓ3మ్' నామక సర్వాంతర్యామి





వైజ్ఞానిక వ్యాఖ్య :

సుమ్నార్థి

(డా॥ కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ



## జాతీయ ప్రార్థన (National Prayer)

ఓ3మ్ ఆ బ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మవర్చసీ జాయతామ్ ।
ఆ రాష్ట్రే రాజన్యః శూర ఽ ఇషవ్యోఽ తి వ్యాధీ
మహారథో జాయతామ్ ।
దోగ్ధ్రీ ధేను ర్వోఢాఽ నడ్వానాశుః సప్తిః ।
పురన్ధిర్యోషా జిష్ణూ రథేష్ఠాః ।
సభేయో యువాఽ స్య యజమానస్య వీరో జాయతామ్ ।
నికామే నికామే నః పర్జన్యో వర్షతు ।
ఫలవత్యో న ఓషధయః పచ్యన్తామ్ ।
యోగక్షేమో నః కల్పతామ్ ॥ – యజుర్వేదం (22-22)

ఓ సర్వవ్యాపక సర్వేశ్వరా! మా దేశంలో వేదవిద్యా శోభితులైన బ్రాహ్మణులు దేశమంతటా ఉద్భవింతురు గాక! శూరవీరులు, బాణవిద్యా నిపుణులు, శత్రువులకు అత్యంత వ్యధను కలిగించు పరాక్రమవంతులు, గొప్పరధికులునైన రాజులు (త్రివిధ సైనిక శక్తులు) అంతటా ఉద్భవింతురుగాక! గోవులు దుగ్ధపూర్ణములగును గాక ! ఎడ్లు భారవాహ సామర్థ్యం కలవి అగును గాక! అశ్వములు శీఘ్రగాములగును గాక! స్త్రీలు గృహ సామ్రాజ్ఞులై ప్రజలను చక్కగా పోషింతురుగాక! రథికులు సదా జయశీలురగుదురు గాక! ఈ దేశ నాయకులకు పూర్ణయువావస్థను పొందు సభ్యులైన వీరపుత్రులు, అనుచరులు చక్కగా ప్రాప్తింతురుగాక! మేము కోరినపుడెల్ల మేఘములు వర్షించునుగాక! మా అన్న ఓషధాదులు ఫలపుష్ప సంభరితములగును గాక! మాకు యోగ క్షేమములన్నియు పూర్ణంగా ప్రాప్తించును గాక!




# వేదాలలో వర్షేష్టి విజ్ఞానం

## వర్షేష్టిసూక్తం - సరళార్థ సహితం

బృహత్ యజ్ఞవిధి పూర్వకం



మంత్రకర్త :

'ఓ౩మ్' నామక సర్వాంతర్యామి

వైజ్ఞానిక వ్యాఖ్య :

సుమ్నార్థి

(డా. కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 59

**వేదాలలో వర్షేష్టి విజ్ఞానం**

వర్షేష్టి సూక్తం - సరళార్థసహితం

ప్రతులు : 1000



సృష్టిసంవత్సరము : 197, 29, 49, 116.
విక్రమాబ్దము : 2076.
కలియుగాబ్దము : 5116.
శ్రీ మన్మథనామ సం॥రం జ్యేష్ఠ శు. పూర్ణిమ
తెలంగాణ ఆవిర్భావదినం : (2-6-2015)

**మూల్యము : రూ. 25=00**
(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (P.O.) ; (Via.) భువనగిరి గంజ్ - 508 117.
సెల్ : 9290604641, 9908994084.
2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్యసమాజము,
12-10-586/6, వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.
కార్యదర్శి : శ్రీ కె.పి. నర్సింగ రావు. సెల్ : 98480 11073.
3. ఆర్యసమాజము, మెయిన్‌రోడ్డు, సీతాఫలమండి - 500 061.
4. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం.5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్.
ఫోన్ : 040-6632 0300.
5. శ్రీ విద్యా బుక్ డిపో మరియు గోపాల్ బుక్ హౌస్,
ఆర్యసమాజము ఎదురుగా, సుల్తాన్‌బజార్, హైదరాబాద్.
6. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.

*Printed at :*

**PRINTSHOP** - 6632 0300.




# సృష్టికర్త వర్షేష్టి ఉపదేశం

సం బర్హిరంక్తాం హవిషా ఘృతేన సమాదిత్యై ర్వసుభిః సమ్మరుద్భిః ।
సమిన్ద్రో విశ్వదేవేభిరంక్తాం దివ్యం నభో గచ్ఛతు యత్స్వాహా ॥

– యజుర్వేదం (2-22)

<u>మంత్ర పదవిభాగం :</u> సమ్, బర్హిః + అంక్తామ్, హవిషా, ఘృతేన, సమ్ + ఆదిత్యైః, వసుభిః, సమ్+మరుద్భిః, సమ్+ఇన్ద్రః + విశ్వదేవేభిః + అంక్తామ్, దివ్యం, నభః + గచ్ఛతు, యత్ + స్వాహా.

ఓ మానవులారా ! వర్షేష్టి యజ్ఞంలో మీరు అందుకు తగిన మూలికలను, ఆవునేతిని ఆహుతులుగా యిస్తే అవి సూక్ష్మీకరింపబడి – అణువులుగా విడిపోయి వాయువులో కలిసిపోతాయి. అవి క్రమంగా చక్కగా ద్వాదశాదిత్యులను అంటే 12 నెలలోని 12 రకాల సూర్యకిరణాలను కలుసుకొని వాటిని సంస్కరిస్తాయి. శుద్ధిచేస్తాయి. అంతటితో ఆగక అవి అష్టవసువులను చేరుకుంటాయి. అంటే – భూమి జలము అగ్ని వాయువు ఆకాశము అనబడే పంచభూతాలలోను, సూర్య చంద్ర నక్షత్రాల (5+3) లోను ప్రవేశిస్తాయి. ఈ ఆహుతులలోని అత్యంత సూక్ష్మమైన ఉదజని, కొన్ని పరమాణుశకలాలు సూర్యుని చేరుకుంటాయి. అవి సూర్యుని సంస్కరించి, వృష్టిసర్జన కిరణాలను ప్రేరేపిస్తూ మరల భూమిని చేరుకుంటాయి. భూ వాతావరణంలోని నీటియావిరిని మేఘాలుగా మార్చి వర్షింపచేస్తాయి. దూరంగా ఉన్న మేఘాలను కూడా ఆకర్షించి వర్షేష్టి యజ్ఞం చేసిన ప్రాంతంలో వర్షాలను కురిపిస్తాయి.

# ప్రాక్కథనం (ఫోర్‌వర్డ్)

"నికామే నికామే నః పర్జన్యో వర్షతు" యజుర్వేదం (22-22)

"మీ రెప్పుడెప్పుడు వర్షాలు కోరిన అప్పుడప్పుడు వర్షించు అవకాశం ఉంది. నా ఉపదేశాలైన వేదాలలో ఆ విజ్ఞానం నిక్షిప్తమై ఉంది. మీరు వానిని మనన చింతన పరిశోధనలు చేసి విస్తృత పరచుకోం"డని సృష్టికర్త సృష్ట్యాదిలోనే ఉపదేశించాడు. ప్రాచీన ఋషులు అట్లే చేసి లోకానికి ఎంతో మేలుచేశారు. వర్షేష్టితో అవసరమైనప్పుడల్లా వర్షాలు కురిపించారు. కాని, మధ్యకాలంలో విదేశీయుల పాలనలో అది కనుమరుగై పోయింది. మహర్షి దయానందుల వారు మరల వానిని పునరుద్ధరించి లోకానికెంతో మేలుచేశారు. ఆ మార్గంలో పయనించిన ఆర్య విద్వాంసులు పం. వీరసేన్ వేదశ్రమీ, డా. కపిల్‌దేవ్ ద్వివేదీ మున్నగువారు వర్షేష్టిని రూపకల్పనచేసి ఆచరణలో పెట్టి చక్కటి ఫలితాలను సాధించారు. వారి అనుయాయులు కొందరు ఇప్పుడును అక్కడక్కడ వర్షేష్టి యజ్ఞాలను నిర్వహిస్తున్నారు. ఫలితాలు ఆశాజనకంగా ఉన్నాయి. ఈ ప్రయత్నాలు సరిపోవు. ఆధునిక విజ్ఞానం అంగీకరించే విధంగా పరిశోధనలు జరుపవలసి ఉంది. అందుకు ప్రభుత్వ సాయం, ప్రజల సహకారం, విజ్ఞానవేత్తల సహృదయత చాలా అవసరం.

ఇంతవరకు ఆర్య విద్వాంసులు జరిపిన ఆలోచనల, పరిశోధనల సారాంశాన్ని 'వర్షేష్టి విజ్ఞానం' పేరుతో ఈ చిన్న పుస్తకంలో వ్రాయటం జరిగింది. వారు సంకలనం చేసిన వేదమంత్రాలతో కూడిన విశేషహోమ విధిని కూడా చేర్చటం జరిగింది. అన్ని శుభకార్యాలలోను, అన్ని సంస్కారాలలోను చేయవలసిన పరమేశ్వర స్తుతి ప్రార్థనోపాసనలను, స్వస్తివాచన శాంతికరణాలను, సామాన్య ప్రకరణాన్ని (బృహత్ యజ్ఞ విధి విధానాలను) కూడా యిందులో చేర్చి ముద్రిస్తున్నాము. అందువల్ల వర్షేష్టి జరిపించు పండితులకు, కార్యకర్తలకు, యజ్ఞాలలో పాల్గొనే భక్తులకు అందరికీ ఉపయుక్తంగా ఉంటుంది.

ప్రజలు సామూహికంగా చేసే ప్రార్థనలవల్ల ప్రకృతిలో సానుకూలమైన మార్పులు కలుగుతాయనీ, పరమేశ్వరుని అనుగ్రహం లభిస్తుందనీ పెద్దలంటారు. వర్షాభావ ప్రాంతాలలో అందుకు తగిన మూలికలతో కూడిన హోమద్రవ్యాలతో వర్షేష్టి యజ్ఞాలు చేస్తూ జరిపే ప్రార్థనలవల్ల ఎక్కువ ప్రయోజనం ఉంటుంది. పురుషార్థంతో కూడిన ప్రార్థన సఫలమౌతుంది. వర్షేష్టిలో చదివే వేదమంత్రాలలో అట్టి ప్రార్థనలున్నాయి. వాటిని పఠించేటప్పుడు వాటి అర్థాలు మన మనస్సులో

స్ఫూరిస్తూవుంటే ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుంది. **'తత్ జపః తదర్థ భావనమ్'** అంటారు కదా! పతంజలి మహర్షి. అందుచే ఈ పుస్తకంలో వాటికి అర్థాలు వ్రాయబడ్డాయి.

నేను ఈ వర్షేష్టి మంత్రాలకు అర్థాలు ఆర్యవిద్వాంసులు పం. క్షేమకరణదాస్ త్రివేదీ, పం. జయదేవశర్మ విద్యాలంకార్ గార్ల వేద భాష్యాల ఆధారంగా వ్రాశాను. వీటికి వినియోగపరంగా అంటే - వర్షేష్టి పరంగా - వర్షం కొరకు పరమేశ్వర ప్రార్థనలుగా వ్రాశాను. విజ్ఞులు ఇందేవైనా లోటుపాట్లున్న తెలుపగోరుచున్నాను. ద్వితీయ ముద్రణలో సరిచేసుకోగలను.

వర్షేష్టి యజ్ఞం చేయునపుడు ఈ మంత్రాల చివర 'స్వాహా' కారం పలుకుతూ ఆహుతు లివ్వవలసి ఉంటుంది. అందుకు తగిన మూలికలతోను, దేశీఆవునేతితోను ఆహుతులిచ్చిన చక్కటి ఫలితం ఉంటుంది. మా ప్రచురణలు "అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం, అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ, అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము, యజ్ఞ ప్రసాదము" చదివిన అగ్నిహోత్రంలోని వైజ్ఞానికత చక్కగా అవగతమౌతుంది. యజ్ఞంపై శ్రద్ధ ఇనుమడిస్తుంది.

ఈ పుస్తక ప్రచురణలో సహకరించిన ప్రింట్‌షాపు వారికి, బృహద్ యజ్ఞవిధి డి.టి.పి. నిచ్చిన వైదిక ధర్మప్రచార సమితి వారికి, దాతలు శ్రీ కంకణాల కిషన్‌శేఠ్ గారికి నా హార్ధిక ధన్యవాదాలు.

పాఠకులకు శుభాకాంక్షలు

సుమ్నార్థి

(డా. కోడూరి సుబ్బారావు)
వైదిక వానప్రస్థ సాధకాశ్రమం
హనుమాపురం, భువనగిరి,

శ్రీ మన్మథ హనుమత్ జయంతి
(13-5-2015)





# వేదాలలో వర్షేష్టి విజ్ఞానం

మన తెలుగు రాష్ట్రాలలో ముఖ్యంగా తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలో కొన్ని సంవత్సరాలుగా వర్షాలు పడనందున జలాభావస్థితి ఏర్పడింది. పంటలు నామమాత్రంగా ఉన్నాయి. త్రాగునీటి సమస్య కూడా ఎదురగుచున్నది. ఇట్టి పరిస్థితిలో కృత్రిమ వర్షాల కొరకు ప్రయత్నం జరుపుట అవసరమే. ఆధునిక ప్రయోగాలవల్ల కొద్ది ప్రయోజనం కలుగుచున్నను ఆర్థికభారం ఎక్కువగా ఉంది. అందుచే శ్రేష్ఠమైన, అల్పవ్యయంతో విస్తృత ప్రయోజనం కలుగు ఉపాయాలను అన్వేషించటం ఎంతైనా అవసరం.

ప్రాచీన భారతీయ చరిత్రను పరిశీలించినచో వర్షాలకొరకు వర్షేష్టి యజ్ఞాలు నిర్వహించి ఎంతో లాభం పొందినట్లు కనబడుతుంది. ప్రాచీన ఋషులు ఎంతో తపించి నిర్మించిన విజ్ఞాన శాస్త్రాలను విదేశీ దురాక్రమణదారులు చాలావరకు నశింపజేసినను స్వల్పంగా మిగిలిఉన్నాయి. ఆ విజ్ఞాన గ్రంథాలు స్వల్పంగా ఉన్నా ఆ విజ్ఞానాలకు ఆధారమైన వేదాలు సురక్షితంగానే ఉన్నాయి. వాటిని మరల మనం అధ్యయనంచేసి, మనన చింతనలు చేస్తే తప్పక ఆ విజ్ఞానాన్ని వెలుగులోనికి తీసుకురావచ్చును. మహర్షిదయానందుడు అట్టి ప్రయత్నాన్నే చేశారు. వారు వేదాలకు పూర్తిగా భాష్యం వ్రాయలేకపోయినా యజ్ఞవిజ్ఞానం గల యజుర్వేదానికి పూర్తిగా భాష్యం వ్రాశారు. అందు యజ్ఞం (అగ్నిహోత్రం) వల్ల కలుగు లాభాలెన్నిటినో సూత్రప్రాయంగా సూచించారు. యజ్ఞాలవల్ల ముఖ్యంగా అగ్ని, గాలి, నీరు శుద్ధమగుననియు, దోషరహితమగుననియు హేతు బద్ధంగా వివరించారు. తద్వారా భూమిపై ప్రాణి మనుగడ సుఖవంత మగుననియు అనేక సందర్భాలలో ఆ వేదభాష్యం నందు వివరించారు.

యజుర్వేదం **'వర్ష వృద్ధమసి'** (య. 1-16) **'వర్షమును వృద్ధిచేయుము'** అని ప్రేరణనిచ్చును. అందుకు యజ్ఞము, వాయువు, సూర్యకిరణాలు అవసరమనియు సూచించును. అందు యజ్ఞం (అగ్నిహోత్రం) వలననే వాయు, సూర్యకిరణాలను మన కనుకూలంగా మార్చుకొనవచ్చును. అందుచేతనే యజ్ఞమును **'వృషణం'** (య. 34:14) వర్షమునకు హేతువనియు, **'వృషాసి'**

(య. 22:19) యజ్ఞాగ్ని వర్షాన్ని కలిగించుననియు వేదం చెప్పును.

వర్షాన్ని – నీటిని కోరు మనం ముందుగా నీరు ఎచటెచట లభించునో తెలుసుకోవలసియున్నది. అందుకు వేదం ఏమి చెప్పునో గమనించుడు.

**"పయః పృథివ్యాం, పయ .... ఓషధీషు, పయో దివ్యంతరిక్షే, పయో ధాః" ॥**

**– యజుర్వేదం (28-36)**

పయః అనగా పానయోగ్యమైన శుద్ధ జలము. అది భూమిపైన, లోపలగలదు. 'ఓషధీషు' ఓషధులలో – వృక్ష, లత, ఫల శాకాదులలో రసరూపమున నీరుండును. 'అంతరిక్షే' అంతరిక్షమునందు, అంతకన్న పైన గల ద్యులోకమునందు జలము గలదు. అట్టి జలం నాకు అన్ని దిక్కులనుండి లభించుగాక!

ఈ పై వేదమంత్రంలో భూమియందేగాక అంతరిక్ష ద్యులోకాలలో (సూర్య చంద్ర నక్షత్రాదులలో) నీరు గలదని చెప్పబడినది. అంతరిక్షంనందు నీటియావిరిగా – మేఘాలుగా ఉన్నదని ఆధునిక విజ్ఞానం అంగీకరించును. ఇక ద్యులోక జలమును గూర్చి నేటి విజ్ఞానానికి తెలియదు. ద్యులోక మనగా – సూర్య చంద్ర గ్రహ ఉపగ్రహములుండు స్థానము–లోకము. అందు నీరు అత్యంత సూక్ష్మంగా (సోమరూపమున) ఉండునని యజుర్వేదం చెప్పును.

యజుర్వేదమున మరియొక చోట (య. 23-47,58) **'కిం సముద్ర సమం సరః'** అని ప్రశ్నించుకొని సమాధానంగా **'ద్యౌః సముద్ర సమం సరః'** – ద్యులోకమే సముద్రము వంటి జలస్థానమని చెప్పును. గాన అంతరిక్షమందు జలం లభించని వక్షమున ద్యులోకం నుండి వర్షాన్ని తెచ్చుటకు ప్రయత్నించవలసియున్నది. అది ఏ విధంగా రాబడునో కూడా యజుర్వేదం సూచించును.

**పూర్ణా దర్వి పరాపత సుపూర్ణా పునరాపత ।**
**వస్నేవ విక్రీణావహా౨ ఇష మూర్జం.... శతక్రతో ॥**

(యజుర్వేదం–అధ్యాయం 3. మంత్రం 49)

మనం హోమయోగ్యమైన పదార్థాలతో పూర్ణంగా ఆహుతుల నిచ్చిన అవి అంతరిక్ష ద్యులోకాలను చేరి, అచ్చట జలంతో కలిసి 'సుపూర్ణ' మగును. తదుపరి 'పునరాపత' అనగా ఆహుతుల విశేషం అచట జలంతో కలిసి తిరిగి భూమిపై వర్షించును. ఈ కార్య మెటులున్న దనిన తగిన మూల్యం చెల్లించి అంగడిలో వస్తువులను బడయు వైశ్య – వ్యాపార క్రియగా నున్నది.

అనగా యజ్ఞమే – అగ్నిహోత్రమే వర్షాన్ని పొందే మార్గం. మహర్షి

మనువు కూడా ఈ విషయాన్నే ప్రతిపాదించును.

అగ్నౌ ప్రస్తాహుతిః సమ్యగాదిత్య ముపతిష్ఠతే ।
ఆదిత్యాజ్జాయతే వృష్టిర్ వృష్టేరన్నం తతః ప్రజాః ॥

(మనుస్మృతి 3-76)

యజ్ఞంనందు వ్రేల్చబడిన ఆహుతులు క్రమంగా వాయురూపం చెంది అంతరిక్షం చేరును. ఆ వాయువునందలి సూక్ష్మాంశం (ఉదజని, కొన్ని పరమాణు శకలాలు) క్రమంగా ద్యులోకమున ప్రవేశించి సూర్యుని చేరును. అచటినుండి సూర్యకిరణాలతో కలసి ద్యు అంతరిక్ష లోకాలందలి జలాన్ని వర్షరూపమున భూమికి తీసుకువచ్చును. ఆ వర్షజలంతో అన్నాదులు కలుగుటయు, తద్వారా ప్రాణులు జీవించుటయు జరుగుచున్నది.

యజుర్వేదంలో యజ్ఞం వలన కలుగు అనేకానేక ప్రయోజనములు వివరింపబడినవి.

**"వసోః పవిత్రమసి శతధారం, వసోః పవిత్రమసి సహస్రధారమ్ ।**
**దేవస్త్వా సవితా పునాతు వసోః పవిత్రేణ శతధారేణ సుప్వా కామధుక్షః ॥**

(యజుర్వేదం 1-3)

ఓ యజ్ఞమా! నీవు నూరు రకాల ప్రయోజనకారివి. వేల విధాల ప్రయోజనాలను గలుగజేయుదువు. పవిత్రపరచుటలో నీవు ఉత్తమోత్తమమైన దానివి. కోరిక లను దుగ్ధాన్ని కురిపించు కామధేనువువు.

**"వసుభ్యస్త్వా రుద్రేభ్యస్త్వా ఆదిత్యేభ్యస్త్వా సంజానాథామ్**
**ద్యావాపృథివీ మిత్రావరుణౌ త్వా వృష్ట్యావతామ్ ।**
**వ్యన్తు వయోక్తం రిహాణా మరుతాం పృషతీర్గచ్ఛ వశా**
**పృశ్నిర్భూత్వా దివం గచ్ఛ తతో నో వృష్టిమావహ ।**
**చక్షుష్పాఽ అగ్నేఽసి చక్షుర్మే పాహి ॥** (యజుర్వేదం 2-16)

ఓ యజ్ఞాగ్ని! నీ యందు అర్పించబడిన ఆహుతి వలన వసుదేవతలు అనగా ప్రాణులు వసించ జీవించ యోగ్యమగు పంచభూతాలు, అందుకు తోడ్పడు సూర్య చంద్ర నక్షత్రాదులు పుష్టివంతమగును. రుద్రదేవతలు అనగా ప్రాణుల శరీరమందలి పది విధములుగా పనిచేయు ప్రాణవాయువు సంస్కరింపబడి బలపడును. ఆదిత్యుడు అనగా తాపభేదంతో పన్నెండు మాసాలలో నుండు ద్వాదశాదిత్యులు (సూర్యకిరణాలు) చైతన్యవంతమగును. ద్యులోక పృథివీలోకాల మధ్యననుండు అంతరిక్షం పూర్ణ ప్రయోజనకారి యగును. మిత్రావరుణులు అనగా

ప్రాణవాయువు మరియు ఉదజని వాయువులు దీనివలన బలపడి వర్షాన్ని కురిపించుటలో సహాయకములగును. ఈ క్రియ ఎటులున్నదన్న పక్షులు తమ కనుకూలంగ గూళ్ళను నిర్మించుకొని అందు నిరాటంకంగా నివసించునటు లున్నది. అగ్నియందు శ్రద్ధతో నీయబడిన ఆహుతి వాయువులో కలిసి అంతరిక్షాన్ని చేరి అందు స్థిరపడుచున్నది. (దివం గచ్ఛ) అచటనుండి ద్యులోకానికి చేరి (**తతో నః వృష్టిమావః**) అచటినుండి మనకు వర్షాన్ని తెచ్చును. ఇంతేగాక, ఈ యజ్ఞాగ్ని నేత్రాలను రక్షించుశక్తి గలది. గాన (**చక్షుర్మే పాహి**) అది నా నేత్రాలను కాపాడును గాక!

పై వేదోపదేశం ఎంతవరకు విజ్ఞాన సమ్మతమో పరీక్షించవలసి ఉంది. వర్షకామనతో చేయు వర్షేష్టియజ్ఞం ఆరుబయట చేయవలసియుండును. భూమిపైన పెద్ద యజ్ఞవేదికను నిర్మించవలెను. నాలుగువైపుల యజమానులు (యజ్ఞకర్తలు); యజ్ఞవిజ్ఞానం తెలిసి చక్కగా శుద్ధమంత్రోచ్చరణ చేయగల విద్వాంసులు వారి వారి స్థానములందు ఆసీనులై శ్రద్ధతో దీనిని ఆచరించవలెను. వర్షేష్టికి అవసరమగు ఆవునేతిని, ఆవుపాలను, సమిధలను, మూలికలను తగినంతగా సేకరించి అందుబాటులో ఉంచుకొనవలెను.

యజ్ఞక్రియ వలన యజ్ఞవేదిక చుట్టూ ఉండు గాలి వేడెక్కును. వేడెక్కిన గాలి తేలికయై పైకెగయును. ఆ ఖాళీ ప్రదేశాన్ని దూరంగానున్న గాలి ఆక్రమించును. అదియును వేడెక్కి పైకెగయును. ఇట్లు వేడిగాలి భూమిలోనికి పంపు బర్మా (బోరింగ్) వలె అంతరిక్ష ద్యులోకముల వైపుకు (పైకి ఆకాశంవైపుకు) పయనించును. ఆ తాపవాయువు మేఘాలను ఆకర్షించును. సమీపించుచున్న మేఘాలయందు ఘృతాణు మిశ్రిత యజ్ఞవాయువు వ్యాపించి అందు స్థిరపడును. ఘృతం నీటిపై తేలుచుండుట మనము చూచినదే. అట్లే మేఘమునందలి జల అణువులపై నేతి అణువులు చేరును. అందుచే అవి భారవంతమై వర్షించుట జరుగును. ఇంతేగాక, నేతికి శీతలమును అతి తొందరగా గ్రహించు గుణమున్నది. దానివలన కొద్దిపాటి శీతల వాయువు ఆ మేఘాలకు తాకినను ముందుగా నేతి అణువులు దానిని గ్రహించి నీటి అణువుల కిచ్చును. అందుచే అవి భారయుతమై వర్షించును.

నేతి అణువులతో కూడిన యజ్ఞవాయువు మేఘాలు వర్షించుటకు తోడ్పడుటయేగాక మేఘాలను కూడా నిర్మించగలదు. ఎట్లన అంతరిక్షంలో నీరు నీటియావిరి రూపమున (తేమరూపమున) ఎప్పుడును ఎంతోకొంత ఉంటుంది. అందు ఘృతాణుయుక్త యజ్ఞవాయువు వ్యాపించుటచే వాతావరణంలోని

తాపభేదములవలన ఏ కొద్ది శీతలం తగిలినా నేతి అణువులు దగ్గరగుటకు (పేరుకొనుటకు) ప్రయత్నించును. వాటితోపాటు నీటి అణువులును దగ్గరై మేఘాల నిర్మాణం జరుగును. అందుచే **'యజ్ఞాత్ భవతి పర్జన్యః'** - యజ్ఞం వలన మేఘాలు నిర్మాణమగునని చెప్పిన శ్రీకృష్ణుని వచనాలలో అతిశయోక్తి ఏముంది?

ముఖ్యంగా వర్షేష్టియందు ఆవుపాలు మొదలగు నీటి శాతం ఎక్కువగా గల ద్రవ్యాలను ఆహుతులుగా నిత్తురు. అవియును గాలిలోని నీటి శాతాన్ని కొంతవరకు పెంచును. విశేషమూలికలతో కూడిన హోమద్రవ్యాలు మరియు సమిధల ప్రభావమును మేఘ నిర్మాణమునకు మరికొంత దోహదం చేయును. పరిశోధనలు చేయుకొలది-ఆ యా ద్రవ్యాలను విశ్లేషించుకొలది ఆ సత్యములు బయటపడును. **'అద్రి రసి వానస్పత్యః'** వనస్పతులతో అద్రి-మేఘాలు నిర్మాణమగు నను ఈశ్వరవాణి (వేదవాణి) నిరర్థక మెందుకగును?

నేడు విజ్ఞానవేత్తలు మేఘాలు రెండు రకాలుగా (ఉష్ణ శీతల మేఘాలుగా) ఉండునని చెప్పుచున్నారు. అందు మన దక్షిణదేశంలో ఉష్ణమేఘాలే ఎక్కువగా వచ్చుననియు, వాటికి తగినంత చల్లనిగాలి లేక చల్లదనం తగిలినపుడే వర్షించుననియు చెప్పుచున్నారు. విమానాల ద్వారా నిర్వహించే Cloud Seeding ప్రక్రియలో శీతల మేఘాలమీద సిల్వర్ అయోడైడ్ పదార్థాన్ని, ఉష్ణమేఘాల మీద ఉప్పు మరియు మెగ్నీషియం సిలికేట్‌ల మిశ్రమాన్ని పొడిగాచేసి చల్లుదురు. ఈ రెండు రకాల మేఘాలే గాక అద్రి, గ్రావ, పర్వత, అహిః, మేఘ, అభ్ర, వృత మొదలగు పదిహేను రకాల మేఘాలున్నట్లుగా వేదములందు కనబడును. ఇవి అన్నియు మేఘాల వివిధ స్థితులను సూచించునవే. ఆ సమయమున మేఘాల స్థితిని గుర్తించి అందుకు తగిన మూలికలతో ఈ వర్షేష్టి యజ్ఞం చేయవలసి ఉంటుంది. అనగా రోగమొకటే అయినా రోగుల శరీరతత్త్వాన్ని బట్టి వైద్యుడు ఔషధం ఎన్నుకొనునట్లు మేఘాలస్థితిని బట్టి మూలికాదులను ఎన్నుకోవలసి యుండును.

సామాన్యంగా యజ్ఞకార్యాన్ని హోతా, అధ్వర్యుడు, ఉద్గాతా, బ్రహ్మ అను నలుగురు కలిసి నిర్వహింతురు. కాని, వర్షేష్టి యజ్ఞమునకు పై నలుగురితోపాటు వర్షేష్టి నిర్వహించగల మరికొందరు విద్వాంసు లవసరమగునని వేదము చెప్పును.

**హోతాధ్వర్యు రావయాఽ అగ్నిమింధో గ్రావగ్రాభ ఉత శంస్తా సువిప్రః ।**
**తేన యజ్ఞేన స్వరంకృతేన స్విష్టేన వక్షణాఽ ఆ పృణధ్వమ్॥**

(యజుర్వేదం 25-28)

వారెవరన - హోతా అధ్వర్యులే గాక (ఆపయాః) యజ్ఞ సంగతీకరణం చేయగలవారు, దానం గ్రహించుటకు పాత్రులు, (అగ్నిమింధః) తగిన వేడిని కాపాడువారు, (గ్రావగ్రాభః) మేఘాలను స్వీకరించువారు - అనగా మేఘాల స్థితిని, నాటిలోని పరిణామాలను గుర్తించుచు తగిన మూలికా ఘృతాలను నిర్ణయించువారు, (శంస్తా) చక్కగా వేదమంత్రాలతో పరమేశ్వరుని, పరమేశ్వర రచిత పదార్థాలను స్తుతించువారు, (సువిప్రః) చక్కటి వివేకబుద్ధి కలవారు ఇట్టివారితో కూడిన 'యజ్ఞేన స్వరం కృతేన స్విష్టేన" సుశోభిత, సుస్వర వేద ఘోషతోచేయు వర్షేష్టియజ్ఞము వలన (వక్షణా ఆ పృణధ్వమ్) నదులు, చెరువులు మొదలగునవి జలంతో నిండిపోవును.

పై వేదమంత్రంలో గ్రావగ్రాభః, స్వరంకృతేన అను పదములు మేఘాలను ఆకర్షించుటలో, వర్షింపజేయుటలో ప్రభావవంతమైన ధ్వని అవసరమని తెలుపుచున్నవి. **"స్తోమైర్వత్సస్య వావృధే"** వేదమంత్రాలతో మేఘాలు నిర్మితమగునని మరియొక సందర్భమున వేదం సూచించుచున్నది. గాన చక్కటి ఉచ్చస్వర వేదమంత్రోచ్చారణతో వర్షేష్టి నిర్వహించవలసి ఉంటుంది. వేదేతర మానవకృత శ్లోకాదులకు అట్టి శక్తిలేదు. ఏలనన వేదములందు సప్తవిధ ఛందస్సు లుంటాయి. అవి ఏవనగా గాయత్రీ, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతీ, పంక్తీ, త్రిష్టుప్, జగతీ - వీటికి వరుసగా షడ్జః, వృషభః, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాద స్వరము లుంటాయి. వీటి నుండే స, రి, గ, మ, ప, ద, ని అను సప్త సంగీత స్వరము లుద్భవించెనని చెప్పుదురు. ఈ వేదస్వరములవల్ల కలుగు ధ్వని తరంగాలు వాతావరణంపై తమ ప్రభావాన్ని చూపును. ఆ ప్రభావశక్తిని ఋషులు పరిధులుగా కల్పించిరి. అవి భూమిపై నుండి వరుసగా పై అంతరిక్ష ద్యులోకాలలో వ్యాపించును. అనగా భూమినుండి కొంత ఎత్తువరకు గాయత్రీ పరిధి, ఆ పొరలో **'షడ్జః'** స్వర ప్రభావ ముండును. దానిపైన **'వృషభ,'** ఆపైన **'గాంధార'** ఈ రకంగా చివరి పరిధిగా **'జగతి'** ఉండును. అందు చివరి స్వరము 'నిషాద' స్వరము ప్రభావమును చూపును. ఏ పరిధినుండి మనకు నీరు లభించునో అట్టి ఛందస్స్వరములుగల మంత్రాలతో ఆహుతు లిచ్చిన అంతటి సూక్ష్మతర భేదంతో ఆహుతి మరియు స్వరముల ప్రభావం పనిచేసి అచటినుండి మేఘాల నాకర్షించి వర్షాన్ని కురిపించును. ఉదాహరణకు-

గాయత్రీఛందస్సునందు 24 అక్షరాలుటాయి. ఇది తక్కువ అక్షరాలు గల మంత్రం. దీనిని ఒకక్రమంలో చదువుచు మంత్రం చివర స్వాహాకారం

చేయుచు ఆహుతులిచ్చు చున్నయెడల ప్రతి ఆహుతికి ఆహుతికి మధ్యలో మంత్ర పఠనమునకు కొంత సమయం పట్టుచుండును. ఈ కొద్ది సమయంలో మనం వేసిన ఆహుతి కొంతవరకు సూక్ష్మీకరింపబడి వాయువులో కలియును. ఇది సూక్ష్మీకరింపబడినను కొంత స్థూలంగా నుండును. కొద్ది భారయుతంగా నుండును. అందుచే భూమ్యాకర్షణ శక్తిని మించి పైకి పోజాలకుండును. అది వర్షం ద్వారా మరల భూమిపైకి వచ్చును. అందుచేత గాయత్రీఛందస్సుతో కూడిన మంత్రాలద్వారా నిచ్చు ఆహుతుల వలన ఆ ఫలితం భూమండలం వరకే పరిమితమై ఉంటుంది. ఈవిషయమునే యజుర్వేదం **'పృథివ్యాం విష్ణుర్వ్య క్రగ్ంస్తగాయత్రేణ ఛన్దసా'** (యజు. 2–25) అని చెప్పును. ఆకాశంలో మేఘాలు ఉండి వాతావరణంలో తేమ సరిపడినంతగా నుండునపుడు గాయత్రీఛందస్సుతో కూడిన చిన్న మంత్రాలతో ఆహుతులిచ్చుట వలన మేలు కలుగును. అట్లు లేనపుడు అంతరిక్ష ద్యులోకాలలో మార్పు తీసుకొని వచ్చుటకు ప్రయత్నించవలసి ఉంటుంది.

ప్రాచీన భారతీయ వైజ్ఞానికులు (ఋషులు) ఆకాశంలో మేఘాలు లేనపుడు కూడ మేఘాలను నిర్మింపజేయగల పద్ధతులను కనుగొనిరి. ఆ పద్ధతిలో అంతరిక్ష జలాలను ఆకర్షించి వర్షాన్ని కురిపించవవలసి ఉంటుంది. దానికొరకు పెద్ద పెద్ద హవన కుండముల నేర్పరచి త్రిష్టుప్ ఛందస్సుతో కూడిన మంత్రాలతో నాహుతుల నివ్వవలెను. ఈ మంత్రాలు 44 అక్షరములు కలిగియుండును. అందుచే గాయత్రీ మంత్రం పఠించు సమయంకన్న రెట్టింపు సమయం ఈ మంత్రోచ్చారణకు పట్టును. ఆ సమయంలో యజ్ఞాగ్ని రెట్టింపుగా ప్రజ్వరిల్లును. ఆ ప్రజ్వరిల్లిన హోమాగ్నిలో వేసిన ఆహుతి మరింత సూక్ష్మాణువులుగా విడివడి పృథివీ మండలాన్ని దాటి అంతరిక్షాన్ని చేరును. దీనికి యజుర్వేదంలో ఈ ప్రేరణ కనబడుచున్నది. **"ద్విష్మోఽ న్తరిక్షే విష్ణుర్వ్యక్రగ్ంస్త్రైష్టుభేన ఛన్దసా"** త్రైష్టుప్ ఛందస్సు అంతరిక్షమును వశపరుచుకొనునని దీని భావం. మేఘాల పైనుండు భాగాన్ని అంతరిక్షమని చెప్పవచ్చును.

ఈ ఆహుతుల ప్రభావం మేఘాల పైభాగాన నుండు నీటిని లేదా ఇతర గ్రహాలలో నుండు నీటిని ఆకర్షించి వర్షం కురిపించును.

ఇది ఫలించనపుడు చివరగా ఒక ప్రయత్నం చేయవలసి యుండును. సూర్యునిలో జరుగు మార్పులకు భూ వాతావరణానికి కొంత సంబంధమున్నది. సూర్యునిలో హైడ్రోజన్ హీలియం వాయువుల ఘర్షణ వలనను, హీలియం హైడ్రోజన్‌గా మారునపుడు వెలువడు రేడియోధార్మికశక్తి వలనను పెద్ద పెద్ద

మంటలు లేచుచుండును. ఈ మంటలు సూర్యునిలో అంతటా ఒకేవిధంగా నుండక కొన్నిచోట్ల యెక్కువగాను, కొన్నిచోట్ల చాలా తక్కువగాను ఉండును. అవే మనకు దూరదర్శినిలో మచ్చలుగా కనబడును. వీటినే ఇంగ్లీషులో 'సన్‌స్పాట్స్' అందురు. ఈ సన్‌స్పాట్స్‌లోని మార్పులే భూమిమీద జరుగు వాతావరణ విపరీతములైన తుఫానులు, ఉప్పెనలు, అతివృష్టి, అనావృష్టి మొదలగు వాటికి కారణం. వీటిని సరిచేయ గలిగిన నాడు భూవాతావరణంలో ఇటువంటి ఉపద్రవాలు రావు. వాటిని సరిచేయుటకు భారతీయ వైజ్ఞానికులు ఒక యజ్ఞపద్ధతిని కనుగొనిరి.

వేదాలలోని సప్త ఛందస్సులలో జగతీఛందస్సు అన్నిటికన్న పెద్దది. ఈ ఛందస్సుతో కూడిన మంత్రాలు పఠించుటకు గాయత్రీ, అనుష్టుప్ ఛందస్సు మంత్రాలకన్న ఎక్కువ సమయం పట్టును. ఆ సమయంలో యజ్ఞాగ్ని చాలా పెద్దగా ప్రజ్వరిల్లును. అటుల పెద్దగా ప్రజ్వరిల్లిన అగ్నిలో వేసిన ఆహుతి చాలా సూక్ష్మాణువులుగా విడివడి భూమ్యాకర్షణ పరిధిని దాటి అత్యంత తేలిక యగుట వలన ఈ సూర్యకుటుంబంలో అన్నిటికన్న పెద్ద పరిమాణంగల గోళమైన సూర్యునివైపు ఆకర్షింపబడి సూర్యుని చేరును. అట్టివే ఉదజని, కొన్ని పరమాణు శకలాలు. ఇవి సూర్యునిలో మార్పు తీసుకువచ్చు అవకాశమున్నది. ఈ విషయాన్ని యజుర్వేదం ఈ విధంగా సమర్థిస్తుంది. **"దివి విష్ణు ర్వ్యక్రగ్ంస్త జాగతేన ఛన్దసా"** జగతీ ఛందస్సు దివిని (సూర్య నక్షత్రాదులుండు లోకాన్ని) వశపరచుకొనునని దీని భావం. మనువు ఈ విషయాన్నే **"అగ్నౌ ప్రస్తాహూతిః సమ్యగాదిత్య ముపతిష్ఠతే".** అగ్నిలో ఆహుతు లివ్వబడిన ద్రవ్యంలోని సూక్ష్మాంశం క్రమంగా పయనించుచు ఆదిత్యుని (సూర్యుని) చేరుతున్న"దని చెప్పెను.

పై విధంగా ప్రాచీనకాలంలో యజ్ఞంతోనే వాతావరణాన్నంతటిని తమ స్వాధీనపరచుకొని సుఖంగా జీవించిరని మన మూహించవచ్చును. నేటి వైజ్ఞానికులు ఈ మార్గంలో ఆలోచనలు సాగించి యజ్ఞం ద్వారా ప్రయోగాలు చేసిన తప్పక ఫలితాలు కలుగును. ఇండోర్ వాస్తవ్యులు పండిత వీరసేన వేదశ్రమీ గారు యిట్టి యజ్ఞాలను నిర్వహించారు. వారు రచించిన **"వైదిక వృష్టి విజ్ఞాన్"** అను హిందీ గ్రంథంలో మరెన్నో వివరాలున్నాయి.

<u>వర్షం కురియుటలో మిత్రా వరుణుల పాత్ర :</u>

యజుర్వేదం (2-16) లో **"మిత్రా వరుణౌ త్వా వృష్ట్యా వతామ్"** అని చెప్పబడింది. అనగా వర్షం కురియుటలో మిత్రావరుణుల పాత్ర ముఖ్యమైనదని భావం. ఇచట మిత్రావరుణులు అనగా ఆక్సిజన్, హైడ్రోజన్‌లు. యజ్ఞం వలన

ఈ రెండు వాయువులు వృష్టిని పొంది వర్షం కురియును. దీనిని అథర్వవేదం బలపరచుచున్నది.

"మిత్రావరుణౌ వృష్ట్యాధిపతీ తౌ మావతామ్" (అథర్వ 5-24-5)

వర్షాధిపతులైన మిత్రావరుణులు మాకు అనుకూలు రగుదురు గాక! అని ప్రార్థన. నేటి వైజ్ఞానికులుగూడ వర్షం కురియుటలోను, కురియకపోవుటలోను నీటి పాత్రయున్నదని చెప్పుదురు. ఋగ్వేదంలో ఇట్టివే మరికొన్ని ఆలోచనలు కలవు. అగ్నిలో ఆహుతులిచ్చెడి కొన్ని పదార్థాలు వాయు, అంతరిక్షాల ద్వారా ద్యులోకమును జేరి మిత్రావరుణులను సంయుక్తపరచి వాటిని నీటి ఆవిరిగా, మేఘాలుగా మార్చి వర్షింపజేయునని ఋగ్వేదం (1-2-8) లో చెప్పబడినది.

ఇంతకుముందు వివరించినట్లు అగ్నిహోత్రం చేయుచున్నపుడు దాని నాలుగు వైపుల నుండి గాలి వేడెక్కి పైకిపోవుచుండును. క్రింద ఖాళీ అయిన ప్రదేశంలో దూరంగానుండు గాలి ఆక్రమించును. ఇట్లు గాలి వలయాలు యేర్పడుచుండును. ఆ ప్రాంతంలోని వాయువు వేడెక్కి నీటిని ధారణచేయుశక్తిని పెంచుకొనును. ఇంతేగాక, ఆహుతులలోని సోడియం సూక్ష్మాణువులు (న్యూక్లియస్)నేతి యొక్క సూక్ష్మాణువులు (హైడ్రోకార్బన్స్) నీటి ఆవిరిని ఎక్కువగా సేకరించు శక్తిని కలిగియుండును. దానివలన మేఘాలు తయారగు అవకాశమున్నది. కృత్రిమంగా వర్షం కురిపించు వైజ్ఞానికులు మనం ఇంతకు పూర్వం తెలుసుకున్న ప్రయోగంకన్న వేరుగా మరొక ప్రయోగం చేయుదురు. ఆకాశంలో విమానాల ద్వారా సోడియం మొదలైన రసాయనాలను జల్లుదురు. అవి నీటి ఆవిరిని ఎక్కువగా సేకరించి భారయుతమగును. వాటిపై చల్లని గాలి ప్రసరించిన వర్షించును. ఇదియును చాలా వ్యయంతోకూడిన ప్రక్రియయే. అంతేగాక, చాలా సూక్ష్మీకరింపబడిన (విభజింపబడిన) సోడియం మొదలైన రసాయనాలు మాత్రమే నీటిని సేకరించు శక్తిని కలిగి యుండును. అగ్నిహోత్రంలో సోడియం ఎక్కువగా గల మూలికలను వేయుటవలన అవి అత్యంత సూక్ష్మంగా విడగొట్టబడి గాలిలో కలిసి, అంతరిక్షమున ప్రవేశించి మరింత ఎక్కువగా నీటి యావిరిని ఆకర్షించి మేఘాల నుత్పన్నంచేయును.

సముద్రంలోని నీరు ఎండవేడికి ఆవిరగునపుడు కొన్ని సూక్ష్మాతిసూక్ష్మ సోడియం అణువులు (న్యూక్లియస్ అణువులు) నీటి ఆవిరితో కలిసి పైకిపోవును. వాటి ప్రభావం వలననే మేఘము లేర్పడును. అవి ఒత్తుగా జేరి భారవంతమై చల్లగాలి తగిలినపుడు వర్షించును. ఇది ప్రకృతిలో జరుగు సహజ వర్షేష్టి యజ్ఞము.

జలం నీటి యావిరి రూపమున అంతరిక్షంలోనేకాక ఇంకా పైభాగంలో కూడ నుండును. **"పయః పృథివ్యాం పయ ఓషధీషు పయో దివ్యన్తరిక్షే పయోధాః పయస్వతీః ప్రదిశః సన్తు మహ్యమ్"** (యజు. 18. 36) అని యజుర్వేదం చెప్పను. అనగా జలం భూమిమీదను, లోపలను, వృక్షాలందును, అంతరిక్ష ద్యులోకము లందును ధరింపబడి యున్నది. వాటిని మేము మా అవసరాలకు ప్రయత్నపూర్వకంగా పొందుదుము గాక! అని ఈ మంత్రార్థం. భూమిలోని జలాన్ని మనం బావులు మొదలైన వాటిద్వారా త్రవ్విపొందుదుము. అట్లే అంతరిక్ష ద్యులోకాల నుండి కూడా జలమును పొందుదని ఈ మంత్రం ప్రేరణ నిచ్చుచున్నది. అందుచే వాతావరణాన్ని పరిశీలించి ఆ సమయానికి ఏ జలం లభించగలదో తెలుసుకొని అందుకు తగిన ప్రయత్నం చేయవలెను. ఒక్కొక్క సారి ఈ జలం చాలా అరుదుగా నుండును. ఆ స్థితిని వేదములు **"శ్రథ"** అని చెప్పను. ఆ స్థితిలో సోమము నుత్పన్నము చేయగల ఓషధులను ఆహుతు లివ్వవలెను. **(సోమ గచ్ఛ స్వాహా)** ఆ ఆహుతులు చాలా ఊర్ధ్వభాగమునకు పోయి 'సుపర్ణ'గా మారును. అవి క్రమంగా 'కద్రు'గా మారి ద్యులోకమునుండి (సూర్యనక్షత్రాదులుండు లోకము నుండి) వర్షమును తెచ్చును. ఇట్టి పద్ధతి మన ప్రాచీన శాస్త్రాలలో గలదు.

1961 జూన్ నెలలో ఒక చోట పండిత వీరసేన వేదశ్రమీగారు వర్షేష్టియజ్ఞం చేయుచూ ఈ క్రియలన్నిటిని ప్రేక్షకులకు ప్రత్యక్షంగా చూపించి యుండిరి. అందుచే ఈ విజ్ఞానాన్ని పెంపొందించుకొనుటకై ప్రభుత్వం తన ప్రోత్సాహ సహకారా లిచ్చినచో అనుకున్న సమయమున అనుకున్నచోట వర్షాలు కురిపించ వచ్చును. దీని సంబంధమైన మూలికల గురించి **'ఉద్దీష' తంత్రం వృష్టికామో వైతసేవిః సమిద్భే పత్రకేస్తథా'** వర్షము కొరకు **'వైతసీ'** పత్రాలతోను, ఎండుకొమ్మలతోను హవనం జేయవలెనని చెప్పను. నేటి విజ్ఞానాన్ని అనుసరించి హోమద్రవ్యంలో సిల్వర్ అయోడైడ్ అను రసాయనాన్ని ఎసిటోన్‌లో కరిగించి హోమద్రవ్యంలో కలిపి ఆహుతులివ్వవచ్చును. ముఖ్యంగా వర్షేష్టి యజ్ఞానికి ఆవునేతిని ఆహుతులుగా నిచ్చుట మంచిది. ఇక మనం వర్షేష్టికి కావలసిన పదార్థాలను, విధివిధానాలను తెలిసికొందాము.

## వర్షేష్టి యజ్ఞానికి కావలసిన పదార్థాలు
## విధి విధానాలు - ఒక అవగాహన

వర్షేష్టి యజ్ఞం చాలా వ్యయప్రయాసలతో కూడినది. దానికితోడు శ్రద్ధాభక్తులు, ఓర్పు, సహనం, సమయం చాలా అవసరం. ఇవన్నీ సమకూర్చుకో గలిగితే ఫలితాలు అద్భుతంగా ఉంటాయి. యజ్ఞవేదికకు చుట్టూ 5, 6 కిలోమీటర్ల పరిధిలో వర్షాలు పడే అవకాశం ఉంది. కనుక 3, 4 గ్రామాలవారు కలిసి ఈ ప్రయత్నం, ప్రయోగం చెయ్యవచ్చు. నాకు ఈ యజ్ఞాన్ని గూర్చిన స్వానుభవం లేదు. మా సామాజిక మిత్రులు, ఉన్నత వ్యవసాయ విద్యావంతులు అయిన శ్రీమాన్ డా. కొసరాజు తిరుమల రావు (రిటైర్ట్ ప్రొఫెసర్, అగ్రికల్చరల్ యూనివర్సిటీ) గారిని కోరగా వారు వివరంగా 4 పేజీల పెద్ద వివరణ వ్రాసిపంపారు. వారు ఆ పద్ధతిలో వర్షేష్టి యజ్ఞాలుచేసి మంచి ఫలితాలు పొందినవారు. వీరు ప్రస్తుతం వారి స్వగ్రామంలో కొచ్చర్ల (వినుకొండ మండలం, గుంటూరు జిల్లాలో) ఒక వ్యవసాయ క్షేత్రాన్ని ఏర్పాటు చేసుకొని ఇప్పటికీ పరిశోధనలు చేస్తూనే ఉన్నారు. కోరిన రైతులకు మార్గదర్శనం చేస్తున్నారు. ఇంటినే ఆశ్రమంగా చేసుకొని నిత్యాగ్నిహోత్ర సత్సంగాలు చేసుకుంటూ వానప్రస్థివలె జీవితం గడుపుతున్నారు. వారి ధర్మపత్ని శ్రీమతి సూర్యకుమారి గారు వారికి కుడిభుజంగా ఉంటూ వారి ఆదర్శాలన్నిటికి సహకరిస్తున్నారు. అట్టివారు వ్రాసి పంపిన విషయాన్ని సంక్షిప్తంచేసి ఒక అవగాహన కొరకు పాఠకులకు అందిస్తున్నాను.

వీలయితే కనీసం ఈ యజ్ఞం 10 నుండి 15 రోజులు ఉదయ, సాయంత్రాలలో చెయ్యవలసి ఉంటుంది. ప్రతీ యజ్ఞానికి ఆవునెయ్యి ప్రధాన హోమద్రవ్యంగా ఉంటుంది. అట్లని జర్సీ ఆవులనెయ్యి అంతగా ఉపయోగపడదు. ఇప్పుడు స్వామి రాందేవ్ బాబాగారి విశేష కృషివల్ల దేశీ ఆవునెయ్యి పుష్కలంగా అందుబాటులోనికి వచ్చింది. వారు హరిద్వార్‌లో చాలా విశాలమైన దేశీ ఆవుల గోశాలను (డైరీ) ఏర్పాటు చేసి, యంత్రాల సాయంతో స్వచ్ఛమైన శుద్ధమైన ఆవునేతిని ఉత్పత్తి చేస్తున్నారు. దానిని వారు వారి పతంజలి ఆయుర్వేద మందుల షాపులలో తక్కువ ధరకే విక్రయిస్తున్నారు. ఆ షాపులలో మనం ముందుగా ఆర్డరు చేస్తే మనకు కావలసినంత సరఫరా చేస్తారు. ప్రస్తుతం దాని ధర 5 కిలోల డబ్బా రూ. 2,000/-లకు లభిస్తున్నది. ఈ వర్షేష్టి యజ్ఞానికి 5 నుండి 6 క్వింటాళ్ల నెయ్యి 10 రోజుల యజ్ఞానికి అవసరమౌతుంది. కనుక రూ. 2,00,000/-

(రెండు లక్షల)పైననే నేతి ఖర్చు వస్తుంది.

2. సమిధలు : యజ్ఞం కొరకు వాడే కట్టెలను సమిధలంటారు. సామాన్య యజ్ఞానికి మామిడి, మోదుగ, రావి, మేడి, మారేడు, చందన, జాజి, చంద్ర మొదలైన వాటిని వాడవచ్చు. కాని, ఈ వర్షేష్టికి ముఖ్యంగా మోదుగ కట్టెలు శ్రేష్ఠంగా ఉంటాయి. వాటితోబాటు మామిడి కట్టెలు వాడవచ్చు. ఫేముబెత్తం సమిధలు వాడితే మంచిదని కొన్ని గ్రంథాలలో వ్రాసిఉంది. జామాయిల్ (యూకలిప్టస్) సమిధలను కూడా వాడవచ్చు. ఇట్టివి రోజుకు ఒక టన్ను (10 క్వింటాల్స్) అవసరమౌతాయి. అవి మరీ పచ్చివిగా ఉండకూడు. అట్లనీ మరీ పాతవి, నిస్సారమైనవి, పుచ్చినవి కాకూడదు. కనుక 10 రోజులు ముందుగానే మోదుగ, మామిడి కట్టెలు ఒక లారీలో తెప్పించుకొని వాటిని గొడ్డలితో చీల్పించి పెట్టుకోవాలి. అవి పైపట్టుతో కలిసి ఉండాలి. అంపంతో (సామిల్స్‌లో) కోసినవి పనికిరావు. 3, 4 అడుగుల పొడవు, 2, 3, అంగుళాల లావు ఉండవచ్చు.

**3. ఆవుపాలు :** దేశీ ఆవుపాలే కావాలి. ఉదయం 5 లీటర్లు, సాయంత్రం 5 లీటర్లు పాలతో పరమాన్నం (పొంగలి) చేయించి దానిని మధ్యమధ్యలో ఆహుతులుగా యివ్వవలసిఉంటుంది.

**4. కొబ్బరి కుడుకలు, కర్పూరం :** హోమద్రవ్యాలలో కలిపినదానితో బాటు 5, 6 కిలోల కొబ్బరి కుడకలు, ముద్దకర్పూరం 1/2 కె.జి. అందుబాటులో పెట్టుకోవాలి. అవసరాన్నిబట్టి వాటిని వాడవలసి ఉంటుంది.

**5. హోమద్రవ్యాలు :** సామాన్య హవన సామాగ్రి 20 కిలోలలో ఈ క్రింది విశేష హోమద్రవ్యాలు పొడిచేసి కలపాలి. ఈ క్రింది ద్రవ్యాలన్నీ హైదరాబాద్, బేగంబజార్‌లో టోకు మూలికా దుకాణాలలో (హోల్‌సేల్ హెర్బ్స్ షాపులలో) దొరుకుతాయి. అందుకు అవసరమైన డబ్బు తీసుకువెళ్ళాలి. అన్నీ కలిపి సుమారు 2 లక్షల ఖరీదు ఉంటాయి.

| | | |
|---|---|---|
| 1. నల్లని అగరు | – | 12 కిలోలు |
| 2. ఇంద్రజౌ (హిందీపేరు) | – | 12 కిలోలు |
| 3. ధూపసరల్ (హిందీ) | – | 12 కిలోలు |
| 4. తగరు | – | 12 కిలోలు |
| 5. దేవదారు | – | 30 కిలోలు |
| 6. గుగ్గిలం | – | 30 కిలోలు |
| 7. రాల్ (హిందీ) | – | 30 కిలోలు |

| | | |
|---|---|---|
| 8. జాజికాయ | – | 12 కిలోలు |
| 9. తేజపత్రి | – | 12 కిలోలు |
| 10. ఎండు కొబ్బరి | – | 30 కిలోలు |
| 11. ముద్దకర్పూరం | – | 12 కిలోలు |
| 12. బిల్వఫలాలు | – | 12 కిలోలు |
| 13. జటామాంసి | – | 24 కిలోలు |
| 14. చిన్నయాలకులు | – | 6 కిలోలు |
| 15. వస | – | 24 కిలోలు |
| 16. తిప్పతీగ | – | 12 కిలోలు |
| 17. తులసి సమూలంగా | – | 12 కిలోలు |
| 18. వాయు విడంగములు | – | 12 కిలోలు |
| 19. తెల్లచందనంపొడి | – | 30 కిలోలు |
| 20. నాగకేసరాలు | – | 12 కిలోలు |
| 21. నేలవేము | – | 12 కిలోలు |
| 22. ఖర్జూరం | – | 24 కిలోలు |
| 23. సంఖాహులి (హిందీ) | – | 6 కిలోలు |
| 24. బూరుగుబంక | – | 12 కిలోలు |
| 25. వేపాకులు పచ్చివి | – | 24 కిలోలు |
| (ఇవి మనం సేకరించుకోవచ్చును) | | |
| 26. ఖండశర్కర | – | 50 కిలోలు |
| 27. నల్లబెల్లం | – | 50 కిలోలు |
| 28. మోచరస (హిందీ) | – | 6 కిలోలు |

పై వాటినన్నిటిని పొడిచేసి (కొద్దిగా దంచితే చాలు) 20 కిలోల సామాన్య హవన సామాగ్రిలో కలిపి 20 భాగాలు చేసి 20 సంచులలో నింపి తయారుగా పెట్టుకోవాలి. ఉదయం 1సంచి, సాయంత్రం 1 సంచి ఆహుతులుగా యివ్వాలి.

**వర్షేష్టి ఎప్పుడు చేయ్యాలి?:** వర్షేష్టిని మృగశిరకార్తెలో చేస్తే అనుకూలంగా ఉంటుంది. సామాన్యంగా ఋతుపవనాలతో జూన్ మొదటివారంలో తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలలో వర్షాలు పడతాయి. మృగశిరకార్తె ఈ సంవత్సరం (2015లో) జూన్ 8వ తేదీన ప్రారంభమౌతుంది. అప్పటినుండి 3, 4 నెలల కాలంలో అవసరాన్నిబట్టి అవసరమైనచోట చేస్తే సరిపోతుంది. కృష్ణపక్షంలో

అంటే పౌర్ణమి తదుపరి అమావాస్యముందు చేస్తే మంచి ఫలితాలొస్తాయనీ, 11, 13, 15 రోజులు చేస్తే ఇంకా మంచిదనీ శ్రీ తిరుమలరావుగారు వ్రాశారు. ఎందుచేతనేంటే వాతావరణ కాలుష్యం పెరిగిపోతున్నది కనుక ఎన్ని ఎక్కువ రోజులు చేస్తే అంతమంచిదన్నారు. అప్పుడు, నెయ్యి హోమద్రవ్యాలు ఆవుపాలు మొదలగునవి ఎక్కువగా ఏర్పాటు చేసుకోవాలి.

<u>అంచనా :</u> ఈ 5, 6 లక్షల అంచనా కేవలం హోమద్రవ్యాలకొరకు మాత్రమే. మిగిలిన ఏర్పాట్లకు, పురోహితుల ఆధ్వర్యుల దక్షిణలకు, అతిథి సత్కారానికి, వేదిక ఏర్పాట్లకు అదనపు ఖర్చులు కలుపుకోవాలి. కనుక, కొందరు శ్రద్ధాళురు కలిసి తత్కాలిక యజ్ఞసమితిని ఏర్పాటుచేసుకొని చందాలు ప్రోగుచేస్తే భారం తగ్గుతుంది. చుట్టూ 5, 6 కిలోమీటర్ల పరిధిలో వర్షాలు పడతాయి కనుక 4, 5 గ్రామాలు కలిసి చేస్తే యింకా అనుకూలంగా ఉంటుంది. స్పష్టమైన, శుద్ధమైన మంత్రోచ్చారణ చేయగల వారిని, శ్రద్ధాభక్తులు గలవారిని, 10, 15 రోజులు సమయం ఇవ్వగలవారిని అధ్వర్యులుగా ఆహ్వానిస్తే మంచి ప్రభావం పడుతుంది.

<u>యజ్ఞవేది :</u> 10 అడుగుల పొడవు, 10 అడుగుల వెడల్పు ఉంటుంది. కనుక 4 వైపుల రెండేసి జంటలు (8జంటలు లేదా 16 మంది) కూర్చుని ఆహుతులిచ్చే అవకాశముంటుంది. దర్శకులు, భక్తులు ముగింపులో గాయత్రీ మంత్రంతో ఒక్కొక్క ఆహుతి ఇవ్వవచ్చు.

<u>యజ్ఞమండపం, వేది(కుండం) నిర్మాణాలు :</u> ఈ యజ్ఞం ఆరుబయట చెయ్యాలి. తాత్కాలిక యజ్ఞమండపం నిర్మించుకోవాలి. సుమారు 30అ. × 30అ, అడుగుల చతురస్రాకారాంలో మండపం ఉండాలి. దాని మధ్యలో పై కొలతలు 10 అ. × 10అ. ఉండేటట్లు వేది (అగ్నిహోత్రకుండం) నిర్మించుకోవలసి ఉంటుంది. ప్రారంభదినానికి 2 రోజుల ముందే వేది నిర్మాణం పూర్తికావాలి. యజ్ఞకుండం లోపలికికూడా గాలి పోయే విధంగా మొదటి వరుస ఇటుకల మధ్య కొద్ది కాళీ స్థలం ఉంటే మంచిది. ఈ ఏర్పాటు వల్ల గాలి కుండంలోనికి పోయి అగ్ని చక్కగా ప్రజ్వరిల్లి ఆహుతులను చక్కగా భస్మంచేసి గాలిలో కలుపుతుంది. యజ్ఞకర్తలకు (ఆహుతులిచ్చేవారికి) ఎక్కువ వేడివచ్చే అవకాశం ఉంది కనుక వేదికి యజ్ఞకర్తలకు మధ్యలో 1, 2 అడుగుల ఎత్తుగా ఒక పిట్టగోడ ఏర్పాటుచేస్తే అనుకూలంగా ఉంటుందన్నారు.

ఒకవేళ మధ్యలో వర్షంవస్తే అగ్నిహోత్రం(కుండం) తడిసిపోకుండా పైన కప్పటానికి పొడుగైన ఇనుపరేకులు కొన్ని సిద్ధంగా పెట్టుకోవాలన్నారు. శ్రీ తిరుమలరావు గారు పెద్ద ఉత్తరం వ్రాయటమే కాక 40 నిమిషాలపైన ఫోనులో మాట్లాడి మరింత వివరించారు. నా ఈ వివరణ సరిపోకపోతే వారిని

సంప్రదించండి. వారి సెల్ నెం. 99490 73595, 8500218044.

సంక్షిప్తంగా యజ్ఞవిధి : అధ్వర్యులు ముందుగా సామూహికంగా సంకల్పం చెప్పిస్తారు. అనంతరం ఆహుతులు ఇచ్చేవారిచే వారి గోత్రనామాలతో చిన్న సంకల్పం పలికిస్తారు. ఆచమన, అంగస్పర్శలు చేయించి సర్వవ్యాపక సర్వేశ్వరుని చతుర్వేదాలలోని స్తుతి ప్రార్థన ఉపాసనా, స్వస్తివాచన, శాంతికరణ మంత్రాలతో ప్రార్థన చేయిస్తారు. తదుపరి అగ్న్యాధాన సమిధాధానాది హోమవిధులుంటాయి. ముందుగా బృహద్ యజ్ఞవిధి పూర్తిచేసి వర్షేష్టి సూక్తంతోను, పృథివీ సూక్తంతోను ఆహుతులిప్పిస్తారు. సమయము, ఆహుతులిచ్చేవారి శ్రద్ధాబక్తులను బట్టి మంత్రానికి మంత్రానికి మధ్య గాయత్రీ మంత్రంతో ఆహుతులిప్పిస్తారు.

యజ్ఞవేది చుట్టూ 8 జంటలు కూర్చున్నా జంటలు రోజు రోజు మారుతూ ఎక్కువ జంటలకు ఆహుతులిచ్చే అవకాశం కల్పించవచ్చు. కాని, ఒక జంటమాత్రం 10, 15 రోజులు నిష్ఠగా ఉదయ సాయంకాలాలలో ఆహుతులివ్వాలి. ఇట్టివారిని యజమానులు (యజ్ఞానికి మాన్యతనిచ్చి ఆద్యంతం ఆహుతులిచ్చేవారు) అంటారు. ఇట్టివారిని విశేషంగా సత్కరించాలి. ప్రతి రోజు పురోహితులు 8 జంటలకు ఆశీర్వచనాలు చెబుతారు. పూర్ణాహుతి రోజున యజమానులకు (ఆద్యంతం ఉన్నవారికి) విశేషంగా ఆశీస్సులు పలుకుతారు. యజ్ఞంలో వేసే పాయసాన్ని మరికొంత ఎక్కువగా చేసి కొంతభాగం యజ్ఞశేషంగా (యజ్ఞ ప్రసాదంగా) పాల్గొన్న భక్తులకు పంచిపెట్టవచ్చు.

యజ్ఞమండపాన్ని మామిడి ఆకుల తోరణాలతోను, అరటి చెట్లతోను, పూలతోను, పసుపు కుంకుమాదులతోను అలంకరించవచ్చు. నాలుగు మూలలలో నాలుగు పెద్ద కుండలలో నీళ్ళుపోసి కలశాలు మాదిరిగా అలంకరించవచ్చు. మరికొన్ని విషయాలను పురోహితులు చెబుతారు. తెలంగాణ ప్రాంతంలో పం. మురళీ బ్రహ్మచారిగారు మరికొందరు పండితులతో కలిసి చాలా చోట్ల వర్షేష్టి యజ్ఞాలు జరిపించారు. (వారి సెల్ నెం. 9441033702). మీరు వర్షేష్టి జరిపించాలనుకుంటే వారిని సంప్రదించవచ్చు.

యజ్ఞభక్తుల అనుకూలత కొరకు బృహత్ యజ్ఞవిధి మంత్రభాగాన్ని వైదిక ధర్మప్రచారసమితి సౌజన్యంతో ఇక్కడ ప్రచురిస్తున్నాము. ఈ మంత్రాలకు అర్థతాత్పర్యాలతో కూడిన 'వైదిక దినచర్య' పుస్తకాలు కూడా వారివద్ద లభిస్తాయి. తీరిక సమయాలలో వాటిని చదువుతూవుంటే మీకెంతో వేదజ్ఞానం కలుగుతుంది. మానవ జీవిత లక్ష్యం పయనించవలసిన మార్గం స్పష్టంగా గోచరిస్తుంది. ఇక మనం యజ్ఞవిధిని అనుసరిద్దాం...

# బృహత్ యజ్ఞవిధి

(వైదిక ధర్మ ప్రచార సమితి సౌజన్యముతో)

## ఈశ్వర స్తుతి ప్రార్థనోపాసనా మంత్రములు

ఓం విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ యద్ భద్రం తన్న ఆ సువ.

ఓం హిరణ్యగర్భః సమవర్త తాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్
స దాధార పృథివీం ద్యా ముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ.

ఓం య ఆత్మదా బలదా, యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం, యస్య దేవాః
యస్య ఛాయామృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ.

ఓం యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ
య ఈశే అస్య ద్విపద శ్చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమ.

ఓం యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢా యేన స్వః స్తభితం యేన నాకః
యో అంతరిక్షే రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ.

ఓం ప్రజాపతే ! న త్వ దేతా న్యన్యో విశ్వా జాతాని పరి తా బభూవ
య త్కామాస్తే జుహుమ స్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణామ్.

ఓం స నో బంధు ర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా
యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామ న్నధ్యైరయన్త.

ఓం అగ్నే! నయ సుపథారాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్
యుయో ద్ధ్యస్మజ్జుహురాణ మేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥

### స్వస్తి వాచనము

ఓం అగ్ని మీళే పురోహితమ్, యజ్ఞస్య దేవ మృత్విజమ్, హోతారం రత్న ధాతమమ్.

ఓం స నః పితేవ సూనవేఽగ్నే సూపాయనో భవ సచస్వా నః స్వస్తయే.

ఓం స్వస్తి నో మిమీతా మశ్వినా భగః స్వస్తి దేవ్యదితి రనర్వణః
స్వస్తి పూషా అసురో దధాతు నః స్వస్తి ద్యావాపృథివీ సుచేతునా.

ఓం స్వస్తయే వాయు ముపబ్రవామహై సోమం స్వస్తి భువనస్య య స్పతిః
బృహస్పతిం సర్వగణం స్వస్తయే స్వస్తయ ఆదిత్యాసో భవంతు నః.

ఓం విశ్వే దేవా నో అద్యా స్వస్తయే వైశ్వానరో వసు రగ్నిః స్వస్తయే
దేవా అవన్తు ఋభవః స్వస్తయే స్వస్తి నో రుద్రః పాత్వంహసః

ఓం స్వస్తి మిత్రావరుణా, స్వస్తి పథ్యే రేవతి,

స్వస్తి న ఇంద్ర శ్చాగ్నిశ్చ స్వస్తినో అదితే కృతి.
ఓం స్వస్తి పంథా మనుచరేమ సూర్యా చంద్రమసా వివ
పునర్దదతా ఘ్నతా జానతా సంగమేమహి.
ఓం యే దేవానాం యజ్ఞియా యజ్ఞియానామ్ మనో ర్యజత్రా అమృతా ఋతజ్ఞాః
తే నో రాసంతా మురుగాయ మద్య యూయం పాత స్వస్తిభిః సదా నః.
ఓం యేభ్యో మాతా మధుమ త్పిన్వతే పయః పీయూషం ద్యౌ రదితి రద్రిబర్హాః
ఉక్థ శుష్మాన్ వృషభరాన్త్స్వప్నసస్తాం ఆదిత్యాం అనుమదా స్వస్తయే.
ఓం నృచక్షసో అనిమిషన్తో అర్హణా బృహద్దేవాసో అమృతత్వ మానశుః
జ్యోతీరథా అహిమాయా అనాగసో దివో వర్ష్మాణం వసతే స్వస్తయే.
ఓం సమ్రాజో యే సువృధో యజ్ఞ మాయయు రపరిహ్వృతా దధిరే దివి క్షయమ్
తాం ఆవివాస నమసా సువృక్తిభి ర్మహో ఆదిత్యాం అదితిం స్వస్తయే.
ఓం కో వః స్తోమం రాధతి యం జుజోషథ విశ్వే దేవాసో మనుషో యతిష్ఠన
కో వో౽ధ్వరం తువిజాతా అరం కర ద్యో నః పర్ష దత్యంహః స్వస్తయే.
ఓం యేభ్యో హోత్రాం ప్రథమా మాయేజే మనుః సమిద్ధాగ్నిర్మనసా సప్తహోతృభిః
త ఆదిత్యా అభయం శర్మ యచ్ఛత సుగా నః కర్త సుపథా స్వస్తయే.
ఓం య ఈశిరే భువనస్య ప్రచేతసో విశ్వస్య స్థాతు ర్జగతశ్చ మంతవః
తే నః కృతా దకృతా దేనసస్ప ర్యద్యా దేవాసః పిప్పృతా స్వస్తయే.
ఓం భరే ష్వింద్రం సుహవం హవామహే అంహోముచం సుకృతం దైవ్యం జనమ్
అగ్నిం మిత్రం వరుణం సాతయే భగం ద్యావా పృథివీ మరుతః స్వస్తయే.
ఓం సుత్రామాణం పృథివీం ద్యా మనేహసమ్ సుశర్మాణ మదితిం సుప్రణీతిమ్
దైవీం నావం స్వరిత్రా మనాగస మస్రవంతీ మారుహేమా స్వస్తయే.
ఓం విశ్వే యజత్రా అధివోచ తోతయే త్రాయధ్వం నో దురేవాయా అభిహ్రుతః
సత్యయా వో దేవహూత్యా హువేమ శృణ్వతో దేవా అవసే స్వస్తయే.
ఓం అపామీవామప విశ్వా మనాహుతి మపారాతిం దుర్విదత్రా మఘాయతః
ఆరే దేవా ద్వేషో అస్మద్యుయోతనోరు ణః శర్మయచ్ఛతా స్వస్తయే.
ఓం అరిష్టః స మర్తో విశ్వ ఏధతే ప్రప్రజాభి ర్జాయతే ధర్మణస్పరి
య మాదిత్యాసో నయథా సునీతిభి రతి విశ్వాని దురితా స్వస్తయే.
ఓం యం దేవాసో౽వథ వాజసాతౌ యం శూరసాతా మరుతో హితే ధనే
ప్రాత ర్యావాణం రథ మింద్ర సానసి మరిష్యంత మారుహేమా స్వస్తయే.
ఓం స్వస్తి నః పథ్యాసు ధన్వసు స్వస్త్యప్సు వృజనే స్వర్వతి
స్వస్తి నః పుత్రకృథేషు యోనిషు స్వస్తి రాయే మరుతో దధాతన.

ఓం ఇషే త్వోర్జే త్వా వాయవ స్థ దేవో వః సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ,
ఆప్యాయధ్వ మఘ్న్యా ఇంద్రాయ భాగమ్,
ప్రజావతీ రనమీవా అయక్ష్మా మావస్తేన ఈశత,
మాఘశంసో ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత, బహ్వీర్యజమానస్య పశూన్ పాహి.

ఓం ఆ నో భద్రాః క్రతవో యంతు విశ్వతో అదబ్ధాసో అపరీతాస ఉద్భిదః
దేవా నో యథా సదమిద్వృదే అసన్న ప్రాయువో రక్షితారో దివే దివే.

ఓం దేవానాం భద్రా సుమతిరృజూయతామ్ దేవానాం రాతిరభినో నివర్తతామ్
దేవానాం సఖ్య ముపసేదిమా వయమ్ దేవా న ఆయుః ప్రతిరంతు జీవసే.

ఓం తమీశానం జగత స్తస్థుషస్పతిమ్ ధియం జిన్వ మవసే హూమహే వయమ్
పుషా నో యథా వేదసామసద్వృధే రక్షితా పాయు రదబ్ధః స్వస్తయే.

ఓం స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతి ర్దధాతు.

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యే మాక్షభి ర్యజత్రాః
స్థిరై రంగై స్తుష్టువాగ్ం స స్తనూభి ర్వ్యశేమహి దేవహితం యదాయుః

ఓం అగ్న ఆ యాహి వీతయే, గృణానో హవ్యదాతయే, ని హోతా సత్సి బర్హిషి.

ఓం త్వ మగ్నే! యజ్ఞానాం హోతా, విశ్వేషాం హితః, దేవేభి ర్మానుషే జనే.

ఓం యే త్రిషప్తాః పరియంతి, విశ్వా రూపాణి బిభ్రతః
వాచస్పతిర్బలా తేషామ్, తన్వో అద్య దధాతు మే.

**శాంతికరణము**

ఓం శన్న ఇంద్రాగ్నీ భవతా మవోభిః, శం న ఇంద్రావరుణా రాత హవ్యా
శ మింద్రా సోమా సువితాయ శంయోః శ న్న ఇంద్రాపూషణా వాజసాతౌ.

ఓం శన్నో భగః శము నః శంసో అస్తు శన్నః పురంధిః శము సంతు రాయః
శన్నః సత్యస్య సుయమస్య శంసః శ న్నో అర్యమా పురుజాతో అస్తు.

ఓం శన్నో ధాతా శము ధర్తానో అస్తు శన్న ఉరూచీ భవతు స్వధాభిః
శం రోదసీ బృహతీ శం నో అద్రిః శం నో దేవానాం సుహవాని సంతు.

ఓం శన్నో అగ్ని ర్జ్యోతి రనీకో అస్తు శ న్నో మిత్రావరుణా వశ్వినా శం
శన్నః సుకృతాం సుకృతాని సంతు శన్న ఇషిరో అభివాతు వాతః.

ఓం శన్నో ద్యావాపృథివీ పూర్వహూతౌ శ మంతరిక్షం దృశయే నో అస్తు
శం న ఓషధీ ర్వనినో భవంతు శం నో రజసస్పతి రస్తు జిష్ణుః.

ఓం శన్న ఇంద్రో వసుభి ర్దేవో అస్తు శ మాదిత్యేభి ర్వరుణః సుశంసః
శం నో రుద్రో రుద్రేభి ర్జలాషః శం న స్త్వష్టాగ్నాభి రిహ శృణోతు.

ఓం శం నః సోమో భవతు బ్రహ్మ శం నః శం నో గ్రావాణః శము సంతు యజ్ఞాః

శం నః స్వరూణాం మితయో భవంతు శం నః ప్రస్వః శమ్వస్తు వేదిః.

ఓం శం నః సూర్య ఉరుచక్షా ఉదేతు శం న శ్చతస్రః ప్రదిశో భవంతు
శంనః పర్వతా ధ్రువయో భవంతు శం నః సింధవః శము సంత్వాపః.

ఓం శం నో అదితి ర్భవతు వ్రతేభిః శం నో భవంతు మరుతః స్వర్కాః
శం నో విష్ణుః శము పూషా నో అస్తు శం నో భవిత్రం శమ్వస్తు వాయుః.

ఓం శంనో దేవః సవితా త్రాయమాణః శం నో భవం తూషసో విభాతీః
శం నః పర్జన్యో భవతు ప్రజాభ్యః శం నః క్షేత్రస్య పతి రస్తు శంభుః.

ఓం శం నో దేవా విశ్వదేవా భవంతు శం సరస్వతీ సహ ధీభిరస్తు
శ మభిషాచః శము రాతిషాచః శం నో దివ్యాః పార్థివాః శన్నో అప్యాః.

ఓం శం నః సత్యస్య పతయో భవంతు శంనో అర్వంతః శము సంతు గావః
శం న ఋభవః సుకృతః సుహస్తాః శం నో భవంతు పితరో హవేషు.

ఓం శం నో అజ ఏకపా ద్దేవో అస్తు శం నోऽహిర్బుధ్న్యః శం సముద్రః
శం నో అపాం నపాత్పేరు రస్తు శం నః పృశ్ని ర్భవతు దేవగోపా.

ఓం ఇంద్రో విశ్వస్య రాజతి, శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే.

ఓం శం నో వాతః పవతాగ్ం, శం న స్తపతు సూర్యః
శం నః కనిక్రద ద్దేవః పర్జన్యో అభివర్షతు.

ఓం అహాని శం భవంతు నః శం రాత్రీః ప్రతిధీయతామ్,
శంన ఇంద్రాగ్నీ భవతా మవోభిః, శంన ఇంద్రావరుణా
రాతహవ్యా, శం న ఇంద్రా పూషణా వాజసాతౌ,
శ మింద్రా సోమా సువితాయ శంయోః.

ఓం శం నో దేవీ రభిష్టయ, ఆపో భవంతు పీతయే శం యో రభి స్రవంతు నః.

ఓం ద్యౌ శ్శాంతి రంతరిక్షగ్ం శాంతిః, పృథివీ శాంతి
రాపః శాంతి రోషధయః శాంతి ర్వనస్పతయః శాంతిః
ర్విశ్వే దేవాః శాంతిర్బ్రహ్మ శాంతిః, సర్వగ్ం శాంతిః
శాంతిరేవ శాంతిస్సామా శాంతి రేధి.

ఓం తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్ర ముచ్చరత్
పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతగ్ం
శృణుయామ శరదః శతం ప్రబ్రవామ శరదః శత
మదీనాః స్యామ శరదః శతం భూయశ్చ శరదః శతాత్.

ఓం యజ్జాగ్రతో దూరముదైతి దైవమ్ తదు సుప్తస్య త థైవైతి
దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివసంకల్ప మస్తు.

ఓం యేన కర్మా ణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వంతి విదథేషు ధీరాః

యదపూర్వం యక్షమంతః ప్రజానామ్ తన్మే మనః శివసంకల్ప మస్తు.
ఓం యత్ప్రజ్ఞాన ముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతి రంత రమృతం ప్రజాసు
యస్మా న్న ఋతే కించన కర్మ క్రియతే తన్మే మనః శివసంకల్ప మస్తు.
ఓం యే నేదం భూతం భువనం భవిష్య త్పరిగృహీత మమృతేన సర్వమ్
యేన యజ్ఞ స్తాయతే సప్తహోతా తన్మే మనః శివసంకల్ప మస్తు.
ఓం యస్మిన్ ఋచః సామ యజూంషి యస్మిన్ ప్రతిష్ఠితా రథనాభావివారాః
యస్మిం శ్చిత్తగ్ం సర్వ మోతం ప్రజానామ్ తన్మే మనః శివసకల్ప మస్తు.
ఓం యస్మిన్ ఋచః సామ యజూగ్ంషి యస్మిన్ ప్రతిష్ఠితా రథనాభావివారాః
యస్మిం శ్చిత్తగ్ం సర్వ మోతం ప్రజానామ్ తన్మే మనః శివసంకల్ప మస్తు.
ఓం సుషారథి రశ్వానివ యన్మనుష్యా న్నేనీయతేఽభీషుభి ర్వాజిన ఇవ
హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠమ్ తన్మే మనః శివసంకల్పమస్తు.
ఓం స నః పవస్వ శం గవే, శం జనాయ శమర్వతే శం రాజ న్నోషధీభ్యః.
ఓం అభయం నః కర త్యంతరిక్ష మభయం ద్యావా పృథివీ ఉభే ఇమే
అభయం పశ్చా దభయం పురస్తా దుత్తరా దధరా దభయం నో అస్తు.
ఓం అభయం మిత్రా దభయ మమిత్రా దభయం జ్ఞాతా దభయం పరోక్షాత్
అభయం నక్త మభయం దివా నః సర్వా ఆశా మమ మిత్రం భవంతు.

**ఆచమన మంత్రములు**

ఓం అమృతోపస్తరణ మసి స్వాహా
ఓం అమృతాపిధాన మసి స్వాహా
ఓం సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతాం స్వాహా

**అంగస్పర్శ మంత్రములు**

ఓం వాఙ్మ ఆస్యేఽస్తు
ఓం నసో ర్మే ప్రాణోఽస్తు
ఓం అక్ష్ణో ర్మే చక్షు రస్తు
ఓం కర్ణ యో ర్మే శ్రోతమస్తు
ఓం బాహ్వో ర్మే బలమస్తు
ఓం ఊర్వోర్మ ఓజోఽస్తు
ఓం అరిష్టాని మేఽఙ్గాని తనూ స్తన్వా మే సహ సంతు.

**అగ్న్యాధాన మంత్రము**

ఓం భూర్భువః స్వః

ఓం భూర్భువః స్వర్ద్యౌ రివభూమ్నా పృథివీవ వరిమ్ణా తస్యాస్తే పృథివి దేవయజని పృష్ఠే౽గ్ని మన్నాద మన్నాద్యా యాదధే.

**అగ్నినుత్తేజింపజేయు మంత్రము**

ఓం ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహి త్వమిష్టాపూర్తే సగ్ం సృజేథా మయం చ అస్మిన్ సధస్థే అధ్యుత్త రస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత.

**మూడు సమిధాధాన మంత్రములు**

ఓం అయంత ఇధ్మ ఆత్మా జాతవేద స్తే నేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్ ప్రజయా పశుభిర్ బ్రహ్మవర్చసే నాన్నా ద్యేన సమేధయ – స్వాహా. ఇదమగ్నయే జాతవేదసే ఇదం న మమ. (1)

ఓం సమిధాగ్నిం దువస్యత, ఘృతై ర్బోధయ తాతిథిమ్, ఆస్మిన్ హవ్యా జుహోతన.

ఓం సుసమిద్ధాయ శోచిషే, ఘృతం తీవ్రం జుహోతన అగ్నయే జాతవేదసే – స్వాహా, ఇదమగ్నయే జాతవేదసే – ఇదం న మమ (2)

ఓం తన్త్వా సమిద్భి రంగిరో, ఘృతేన వర్ధయామసి, బృహచ్ఛోచా యవిష్ఠ్య – స్వాహా ఇదమగ్నయే౽ఙ్గిరసే – ఇదం న మమ (3)

**ఘృతాహుతి మంత్రములు (5 ఆహుతులు)**

ఓం అయన్త ఇధ్మ ఆత్మా జాతవేద స్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్ ప్రజాయా పశుభిర్బ్రహ్మ వర్చసే నాన్నా ద్యేన సమేధయ – స్వాహా ఇదమగ్నయే జాతవేదసే – ఇదం న మమ

**జల ప్రసేచన మంత్రములు**

ఓం అదితే నుమన్యస్వ. (తూర్పు వైపున)

ఓం అనుమతే౽నుమన్యస్వ. (పడమర వైపున)

ఓం సరస్వ త్యనుమన్యస్వ. (ఉత్తరం వైపున)

ఓం దేవ సవితః ప్ర సువ యజ్ఞం ప్రసువ యజ్ఞపతిం భగాయ, దివ్యో గంధర్వః కేతపూః కేతన్నః పునాతు వాచస్పతిర్వాచం నః స్వదతు. (చుట్టూ)

**అఘారావాజ్యాహుతి మంత్రములు**

ఓం అగ్నయే స్వాహా ఇద మగ్నయే – ఇదం న మమ.

ఓం సోమాయ స్వాహా ఇదం సోమాయ – ఇదం న మమ.

ఓం ప్రజాపతయే స్వాహా, ఇదం ప్రజాపతయే – ఇదం న మమ.

ఓం ఇంద్రాయ స్వాహా, ఇదం ఇంద్రాయ – ఇదం న మమ.

**వ్యాహృత్యాహుతి మంత్రములు**

ఓం భూ రగ్నయే స్వాహా ఇద మగ్నయే - ఇదం న మమ.
ఓం భువ ర్వాయవే స్వాహా, ఇదం వాయవే - ఇదం న మమ.
ఓం భూర్భువః స్వ రగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా,
ఇద మగ్ని వాయ్వాదితేభ్యః ఇదం న మమ.

**స్విష్టకృదాహుతి మంత్రము**

ఓం య దస్య కర్మణో౽త్యరీరిచమ్, యద్వా న్యూన మిహాకరమ్,
అగ్ని ష్టత్స్విష్టకృ ద్విద్యా త్సర్వం స్విష్టం సుహుతం కరోతు మే.
అగ్నయే స్విష్టకృతే సుహుతహుతే సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానామ్
సమర్ధయిత్రే, సర్వాన్నః కామన్త్సమర్ధయ - స్వాహా
ఇద మగ్నయే స్విష్టకృతే - ఇదం న మమ.

**ప్రజాపత్యాహుతి**

ఓం ప్రజాపతయే స్వాహా, ఇదం ప్రజాపతయే - ఇదం న మమ.

**ప్రధానహోమ మంత్రములు**

ఓం భూర్భువః స్వః, అగ్న అయూంషి పవస ఆ సువోర్జమిషం చ నః,
ఆరే బాధస్వః దచ్ఛునామ్ స్వాహా, ఇద మగ్నయే పవమానాయ-ఇదం న మమ.
ఓం భూర్భువః స్వః, అగ్నిర్ ఋషిః పవమానః పాంచజన్యః పురోహితః,
తమీమహే మహాగయం స్వాహా, ఇద మగ్నయే పవమానాయ-ఇదం న మమ.
ఓం భూర్భువః స్వః, అగ్నే పవస్వ స్వపా అస్మే వర్చః సువీర్యమ్,
దధద్రయిం మయి పోషం స్వాహా, ఇదమగ్నయే పవమానాయ-ఇదం న మమ.
ఓం భూర్భువః స్వః, ప్రజాపతే న త్వ దేతాన్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ,
యత్కామాస్తే జుహుమ స్తన్నో అసు వయం స్యామ పతయో రయీణామ్ స్వాహా,
ఇదం ప్రజాపతయే - ఇదం న మమ.

**అష్టాజ్యాహుతి మంత్రములు**

ఓం త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడో౽వ యాసిసీష్ఠాః,
యజిష్ఠో వహ్నితమః శోశుచానో విశ్వా ద్వేషాంసి ప్రముముగ్ధ్యస్మత్ స్వాహా,
ఇద మగ్నీవరుణాభ్యాం - ఇదం న మమ.
ఓం స త్వన్నో అగ్నే౽వమో భవోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ,
అవయక్ష్వ నో వరుణం రరాణో వీహి మృళీకం సహవో న ఏధి స్వాహా,
ఇద మగ్నీవరుణాభ్యాం - ఇదం న మమ.
ఓం ఇమం మే వరుణ శ్రుధీ హవ మద్యాచ మృళయ, త్వామవస్యు రాచకే స్వాహా,
ఇదం వరుణాయ - ఇదం న మమ.

ఓం తత్త్వా యామి బ్రహ్మణా వందమాన స్త దాశాస్తే యజమానో హవిర్భిః,
అహేఁడమానో వరుణేహ బోధ్యు రుశంస మా న ఆయుః ప్రమోషీః స్వాహా
ఇదం వరుణాయ – ఇదం న మమ.

ఓం యే తే శతం వరుణయే సహస్రమ్ యజ్ఞియాః పాశా వితతా మహాన్తః
తేభి ర్నో౽ద్య సవితోత విష్ణు ర్విశ్వే ముంచంతు మరుతః స్వర్కాః స్వాహా
ఇదం వరుణాయ సవిత్రే విష్ణవే విశ్వేభ్యో
దేవేభ్యో మరుద్భ్యః స్వర్కేభ్యః – ఇదం న మమ.

ఓం అయాశ్చాగ్నే అస్యనభిశస్తి – పాశ్చ సత్య మిత్త్వమయాసి,
అయా నో యజ్ఞం వహాస్యయా నో ధేహి భేషజగ్ం స్వాహా,
ఇద మగ్నయే అయసే – ఇదం న మమ.

ఓం ఉదుత్తమం వరుణ పాశమస్మ దవాధమం వి మధ్యమం శ్రథాయ
అథా వయమాదిత్య వ్రతే తవానాగసో అదితయే స్యామ స్వాహా,
ఇదం వరుణా యాదిత్యా యాదితయే చ – ఇదం న మమ.

ఓం భవత న్నః సమనసౌ సచేత సావరేపసౌ
మా యజ్ఞగ్ం హిగ్ంసిష్టమ్, మా యజ్ఞపతిం
జాతవేదసౌ శివౌ భవత మద్య నః స్వాహా,
ఇదం జాత వేదోభ్యాం – ఇదం న మమ.

**ప్రాతఃకాల హవన మంత్రములు**

ఓం సూర్యో జ్యోతి ర్జ్యోతిస్సూర్యః స్వాహా,
ఓం సూర్యో వర్చో జ్యోతి ర్వర్చః స్వాహా,
ఓం జ్యోతిస్సూర్యః సూర్యో జ్యోతిః స్వాహా,
ఓం సజూర్దేవేన సవిత్రా సజూ రుషసేంద్రవత్యా జుషాణః సూర్యో వేతు స్వాహా

**సాయంకాల హవన మంత్రములు**

ఓం అగ్నిర్జ్యోతి ర్జ్యోతి రగ్నిః స్వాహా,
ఓం అగ్ని ర్వర్చో జ్యోతి ర్వర్చః స్వాహా,
(ఓం అగ్నిర్జ్యోతి ర్జ్యోతి రగ్నిః స్వాహా) (మౌనముగా)
ఓం సజూ ర్దేవేన సవిత్రా సజూరాత్ర్యేంద్రవత్యా జుషాణో అగ్ని ర్వేతు స్వాహాః

**ప్రాతస్సాయం సమయముల హవన మంత్రములు**

ఓం భూ రగ్నయే ప్రాణాయ స్వాహా, ఇద మగ్నయే ప్రాణాయ–ఇదం న మమ.
ఓం భువ ర్వాయవే అపానాయ స్వాహా, ఇదం వాయవే అపానాయ – ఇదం న మమ.
ఓం స్వ రాదిత్యాయ వ్యానాయ స్వాహా, ఇదమాదిత్యాయ వ్యానాయ–ఇదం న మమ.

ఓం భూర్భువః స్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః ప్రాణాపాన వ్యానేభ్యః స్వాహా,
ఇద మగ్ని వాయ్వాదిత్యేభ్య ప్రాణాపానవ్యానేభ్యః – ఇదం న మమ.
ఓం ఆపో జ్యోతీరసో౽మృతం బ్రహ్మ భూర్భువః స్వరోం స్వాహా,
ఓం యాం మేధాం దేవగణాః పితర శ్చోపాసతే,
తయామా మద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా.
ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ, యద్భద్రం తన్న ఆసువ స్వాహా.
ఓం అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్
యుయో ధ్యస్మ జ్జుహురాణ మేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ స్వాహా.

అనంతరం వర్షేష్టి సూక్త మంత్రాలతో ఆహుతులివ్వాలి.

ఓం సర్వం వై పూర్ణగ్ం స్వాహా.
ఓం సర్వం వై పూర్ణగ్ం స్వాహా.
ఓం సర్వం వై పూర్ణగ్ం స్వాహా.

గమనిక : ఈ పూర్ణాహుతి మంత్రాలు చివరి దినం చదివి ఆహుతులివ్వాలి.

ఓం వసోః పవిత్ర మసి శతధారం, వసోః పవిత్ర మసి సహస్రధారం,
దేవస్త్వా సవితా పునాతు, వసోః పవిత్రేణ శతధారేణ సుప్వా కామ ధుక్షః స్వాహా

**యజ్ఞానంతర ప్రార్థన** (ఇది వర్షేష్టి మంత్రాల అనంతరం)

ఓం తేజో ౽సి తేజో మయి ధేహి.
ఓం వీర్య మసి వీర్యం మయి ధేహి.
ఓం బల మసి బలం మయి ధేహి.
ఓం ఓజో౽సి ఓజో మయి ధేహి.
ఓం మన్యు రసి మన్యుం మయి ధేహి.
ఓం సహో౽సి సహో మయి ధేహి.

సర్వే భవంతు సుఖినః సర్వే సంతు నిరామయాభిః
సర్వే భద్రాణి పశ్యంతు, మా కశ్చిద్ దుఃఖభాగ్భవేత్.
కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్య శాలినీ
లోకో౽యం క్షోభరహితః, సజ్జనాస్సంతు నిర్భయాః.
స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకా స్సమస్తాస్సుఖినో భవన్తు.

**శాంతిపాఠ మంత్రము**

ఓం ద్యౌశ్శాంతి రంతరిక్షగ్ం శాంతిః, పృథివీ శాంతి రాపః శాంతిరోషధయఃశాంతిః
వనస్పతయశ్శాంతి ర్విశ్వేదేవాః శాంతిర్బ్రహ్మశాంతిః,
సర్వం శాంతిః, శాంతిరేవ శాంతిః, సా మా శాంతి రేధి.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## వర్షేష్టి సూక్తం (సంకలనం)

(ఈ మంత్రాల చివర 'స్వాహా' పలుకుతూ ఆహుతులివ్వాలి.)

సృష్టికర్త ఉవాచ : సృష్టికర్త ఇట్లు ఉపదేశించుచున్నాడు....

1. ఓం ఆపో దేవీ రుపహ్వయే యత్రగావః పిబన్తి నః ।
సింధుభ్యః కర్త్వం హవిః ॥ (ఋ. 1-23-18)

సరళార్థం : "ఓ మానవులారా! ఆకాశంలో కనబడే సూర్యుడు నాచే సృజింపబడిన ఒక దేవత. అది తన కిరణము లనెడి బాహువులతో (చేతులతో) సముద్రంలో ఉండే నీటిని గ్రహించి మేఘాలుగా చేసి మరల భూమిపై వర్షింపజేయు చున్నది. నేను చేయు సృష్టిరూప యజ్ఞానికి సహకరించుచున్నది. అట్లే, మీరును తగిన హోమ ద్రవ్యాలతో ఆహుతులు యిస్తూ లోకానికి గొప్ప ఉపకారం చేస్తూ ఆత్మోన్నతిని పొందండి."

2. ఓం అప్స్వన్తరమృత మప్సు భేషజమపాముత ప్రశస్తయే
దేవో భవత వాజినః ॥ (ఋ. 1-23-19)

సరళార్థం: "ఓ విద్వాంసులారా! జలాలలో రోగాలను పోగొట్టే అమృతత్త్వం ఉంది. అది ఒక ఔషధం. కనుక పరిశోధనలు చేసి జల చికిత్సను ప్రశస్తం చెయ్యండి - ప్రచారం చెయ్యండి. ప్రజలకు మేలు చెయ్యండి."

3. ఓం అప్సు మే సోమో అబ్రవీదన్త ర్విశ్వాని భేషజా ।
అగ్నిం చ విశ్వశంభువ మాపశ్చ విశ్వభేషజీః ॥ (ఋ. 1-23-20)

సరళార్థం : అందరికీ మేలుచేసే సోముడు (పరమేశ్వరుడు) ఏమంటున్నాడంటే - "ఓ మానవులారా! జలాలలో సర్వరోగాలను పోగొట్టే రోగనివారక శక్తులున్నాయి. వ్యాధినిబట్టి జల చికిత్సలు రూపొందించండి. ఇంతేగాక, నీటిలో విశ్వశంభువాగ్ని ఉంది - లోక కళ్యాణకర భౌతికాగ్ని కూడా ఉంది. పరిశోధించండి."

4. ఓం ఆపః పృణీత భేషజం వరూథం తన్వే 3 మమ ।
జ్యోక్ చ సూర్యం దృశే ॥ (ఋ. 1-23-21)

సరళార్థం : జలం ఆరోగ్యాన్ని కలుగజేసే గొప్ప ఔషధం. అది నా శరీరాన్ని ఆరోగ్యంగా సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దును గాక! దానితో నేను దీర్ఘకాలం సూర్యున్ని చూస్తూ దీర్ఘ జీవనాన్ని పొందుదును గాక!

5. ఓం ఇదమాపః ప్ర వహత యత్కించ దురితం మయి ।
యద్వాహమభి దుద్రోహ యద్వా శేప ఉతానృతమ్ (ఋ. 1-23-22)

సరళార్థం : ఈ జలమే నా దుష్టకర్మలను, ఇతరుల యెడ నే చేసిన ద్రోహాలను, పెట్టిన శాపాలను తనయందు ధరించి కాలాంతరంలో నాకు కష్టాలను కలిగించుచున్నది. నేను ఈ సత్యాన్ని గ్రహించి జలంతో బాహ్యావయవాలనేగాక, నా అంతరావయవాలను, మనస్సును కూడా శుద్ధం చేసుకుంటూ పవిత్ర జీవనాన్ని గడపుదును గాక!

6. ఓం ఆపో అద్యాన్వచారిషం రసేన సమగస్మహి ।
పయస్వానగ్న ఆ గహితం మా సం సృజ వర్చసా (ఋ. 1-23-23)

సరళార్థం : మేము పూర్వం చేసిన కర్మలను, వాటి ఫలాలను జలం ద్వార 'అగ్ని'నామక పరమేశ్వరుడు నేడు మాకు ప్రాప్తింపచేయుచున్నాడు. ఆ కర్మఫలదాతయైన ఈశుడే నన్ను శుద్ధుని చేసి నాకు దీప్తిని కలిగించును గాక!

7. ఓం సం మాగ్నే వర్చసా సృజ సం ప్రజయా సమాయుషా ।
విద్యుర్మ అస్య దేవా ఇంద్రో విద్యాత్ సహ ఋషిభిః ॥ (ఋ. 1-23-24)

సరళార్థం : ఓ మానవులారా! ఋషుల, విద్వాంసుల సాంగత్యంతో పరమాత్మ నుపాసించి అగ్నివిద్యను పొందండి. ఆ విద్యతో వర్చస్సును, మంచి సంతానాన్ని, దీర్ఘాయువును పొందండి.

8. ఓం పర్జన్యవాతా వృషభా పృథివ్యాః పురీషాణి జిన్వితమప్యాని ।
సత్యశ్రుతః కవయో యస్య గీర్భిర్జగతః స్థాతర్జగదా కృణుధ్వమ్ ॥
(ఋ. 6-49-6)

సరళార్థం : వర్షేష్టి యజ్ఞాన్ని చేయు ఓ యజమానులారా! పురోహితులారా! ఏ విధంగా మేఘస్థవాయువు వర్షాలను కురిపించుచున్నదో, అట్లే మీరును వర్షాన్ని కురిపించు పదార్థాలను ఆహుతులుగా యిచ్చి వర్షాలను కురిపించండి. లోక కల్యాణాన్ని చేస్తూ గొప్ప కీర్తిని పొందండి.

9. ఓం శం నః సూర్య ఉరు చక్షా ఉదేతు శం నశ్చతస్రః ప్రదిశోభవన్తు ।
శం నః పర్వతా ధ్రువయోభవన్తు శం నః సింధవః శము సన్త్వాపః ॥
(ఋ. 7-35-8)

సరళార్థం : హే పరమేశ్వరా! నీ శాసనంవల్ల మిక్కిలిగా ప్రకాశించు సూర్యుడు మాకు సుఖకారకుడై ఉదయించును గాక! నాలుగు దిక్కులు, నాలుగు మూలలు మాకు సుఖము నిచ్చునవియే యగునుగాక! పర్వతాలు, నదులు, సముద్రాలు అన్నీ మాకు సుఖము నిచ్చునవియే యగును గాక!

10. ఓం శం నో దేవః సవితా త్రాయమాణః శం నో భవంతూషసో విభాతీః

శం నః పర్జన్యో భవతు ప్రజాభ్యః శన్నః క్షేత్రస్య పతిరస్తు : శంభుః ॥

(ఋ. 7-35-10)

సరళార్థం: హే ప్రభో! అంధకారం నుండీ, రోగక్రిముల నుండీ కాపాడి రక్షించు సూర్యుడు మాకు శాంతి దాయకుడగును గాక! విశేష శక్తులుగల ఉషస్సులు మాకు శాంతి నిచ్చును గాక! ప్రజల మేలు కొరకు మేఘాలు వర్షించును గాక! క్షేత్రపతులైన రాజులు, కృషీవలురు మాకు సుఖమును కలిగించు వారగుదురు గాక!

11. ఓం పర్జన్యాయ ప్ర గాయత దివస్పుత్రాయ మీళహుషే ।
స నో యవసమిచ్ఛతు ॥ (ఋ. 7-102-1)

సరళార్థం : ఓ ఋత్విక్కులారా! మీరు మేఘాలను స్తుతించుడు. హోమద్రవ్యాలతో సత్కరించుడు. అవి తృప్తిగా వర్షించి మనకు ఐశ్వర్యముల నిచ్చును గాక!

12. ఓం యో గర్భ మోషధీనాం గవాం కృణోత్యర్వతామ్ ।
పర్జన్యః పురుషీణామ్ ॥ (ఋ. 7-102-1-2)

సరళార్థం : సర్వ ఔషధాలను తన గర్భంలో కలిగిన భూమాత వర్షాలతో పులకించి ఫలించునుగాక! మనను ఆహార వస్త్రాదులతో తృప్తిపరచును గాక!

13. ఓం వర్షిష్ఠక్షత్రా ఉరుచక్షసా నరా రాజానా దీర్ఘశ్రుత్తమా ।
తా బాహుతా న దంసనా రథర్యతః సాకం సూర్యస్య రశ్మిభిః ॥

(ఋ. 8-101-2)

సరళార్థం : అతిశయ బాహుబలసంపన్న దీర్ఘదర్శులును, దీర్ఘశ్రుతులును మేలు కూర్చునట్లే భౌతిక సూర్యుని కిరణాలు మాకు మేలొనర్చును గాక! సకాల వర్షాలను కురిపించును గాక! (కొన్ని రకాల సూర్యకిరణాలు వర్షాలను కురిపించునట).

14. ఓం పర్జన్యః పితా మహిషస్య పర్ణినో నాభా పృథివ్యా గిరిషు క్షయం దధే ।
స్వసార ఆపో అభి గా ఉతాసరన్త్సం గ్రావభిర్నసతే వీతే అధ్వరే॥

(ఋ. 9-82-3)

సరళార్థం : మహిమాన్వితమైన పర్ణములుగల ఈ సోమలతాది వృక్షజాతులకు మేఘము తండ్రి. ఇవి పృథివియొక్క నాభినుండి ఉత్పన్నమైనవి. వీటి వలననే జలధారలు వర్షించును. రాళ్ళతో దంచి వీటి రసమును తీసి ఆహుతులుగా యివ్వండి.

**15.** ఓం పర్జన్యవృద్ధం మహిషం తం సూర్యస్య దుహితా భరత్ ।
తం గంధార్వాః ప్రత్యగృభ్ణన్తం సోమే
రసమాదుధురింద్రాయేందో పరిస్రవ (ఋ. 9-113-3)

సరళార్థం : ఈ మహిమాన్వితమైన సోమలత మేఘాలను వృద్ధిచేస్తుంది. సూర్యపుత్రికయైన శ్రద్ధ వీటిని ఆకాశన్నుండి తీసుకువస్తుంది. గంధర్వులు - పృథివీపుత్రులు ఆమెను స్వీకరిస్తారు. ఓ సోమమా! ప్రాణుల కొరకు స్రవించుము - వర్షాన్ని కురిపించుము.

**16.** ఓం ఈశానా వార్యాణాం క్షయన్తీశ్చర్షణీనామ్ ।
ఆపో యాచామి భేషజమ్ ॥ (ఋ. 10-9-5)

సరళార్థం : జలం జలోత్పన్నములైన అన్న, ఫల, ఓషధాదులన్నిటికి స్వామి. అది మానవాది ప్రాణులన్నిటిని వసింపచేస్తుంది. ఔషధంగా ఉపయోగపడుతుంది. అట్టి జలాన్ని మేమంతా కోరుచున్నాము.

**17.** ఓం అప్సు మే సోమో అబ్రవీదన్త ర్విశ్వాని భేషజా ।
అగ్నిం చ విశ్వశంభువమ్ ॥ (ఋ. 10-9-6)

సరళార్థం : సోముడు - ప్రాణులన్నిటికి సుఖముల నిచ్చు పరమేశ్వరుడు జలంలో సర్వ ఔషధములు ఉన్నవని "ఆపో వై భేషజమ్" అని నాతో చెప్పినాడు. ఇంతేకాక, విశ్వానికంతకు మేలు చేసే అగ్నితత్త్వంకూడా జలంలో ఉన్నట్లు తెల్పినాడు. (ఈ విషయం పరిశోధించవలసియున్నది).

**18.** ఓం ఆపః పృణీత భేషజం వరూథం తన్వే3 మమ ।
జ్యోక్ చ సూర్యం దృశే॥ (ఋ. 10-9-7)

సరళార్థం: జలం ఆరోగ్యాన్ని కలుగచేసే గొప్ప ఔషధం. అది నా శరీరాన్ని ఆరోగ్యంగా సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దును గాక! చిరకాలం వరకు సూర్యుని దర్శించగల దీర్ఘజీవనాన్ని ఇచ్చును గాక!

**19.** ఓం ఇదమాపః ప్రవహత యత్కిం చ దురితం మయి ।
యద్వాహమభిదుద్రోహ యద్వా శేప ఉతానృతమ్ ॥ (ఋ. 10-9-8)

సరళార్థం : ఇంతేగాక, శరీరస్థ జలం నేను చేసిన సర్వ పాపాలను, దుష్ట కర్మలను, దుశ్చర్యలను (ఇతరులకు కలిగించిన ద్రోహాలను, శాపాలను, అసత్యాలను) కూడా తనలో దాచిఉంచి కాలాంతరంలో వాటిని మాచే అనుభవింపచేస్తుంది. అది చిత్రగుప్తుని వంటిది.

(వివరణ : మనం మనోవాక్కాయాలతో చేసిన సర్వ పాపాలు మనస్సులో సంస్కారాలరూపంలో నిలువ ఉంటాయి. అవి కాలాంతరంలో - సమయం వచ్చినపుడు రక్తంలోని నీటిద్వారానే శరీరంలోని ఆ యా అవయవాలకు ప్రవహించి వ్యాధులను బాధలను కలిగిస్తాయి. వివరాలకు నా రచన "వేదాలలో జలచికిత్సా విజ్ఞానం" చదువ గోరుచున్నాను - (గ్రంథకర్త).

20. ఓం **ఆపో అద్యాన్వచారిషం రసేన సమగస్మహి ।**

**పయర్వానగ్న ఆ గహి తం మా సంస్సృజ వర్చసా ॥** (ఋ. 10-9-9)

సరళార్థం : జలం ద్వారా ఈ జన్మలోను, పూర్వ జన్మలలోను, నే చేసిన పాపకర్మలు రసయుక్తములై నాకు ప్రాప్తించుచున్నవి. పరమేశ్వరుడే వాటిని నాకు జలం ద్వార ప్రాప్తింప చేయుచున్నాడు. పాపాలను అనుభవింపచేసి నన్ను శుద్ధుని చేసి నాకు దీప్తిని యిచ్చుచున్నాడు. అట్టి పరమేశ్వరునకు నా వందనములు.

21. ఓం **పర్జన్యవాతా వృషభా పురీషిణేంద్ర వాయూ వరుణో మిత్రో అర్యమా ।**

**దేవాన్ ఆదిత్యాన్ అదితిం హవామహే యే పార్థివాసో దివ్యాసో అప్సు యే॥**

(ఋ. 10-65-9)

సరళార్థం : మేఘాలు మరియు వాయువు నీటిని (తేమను) కలిగి ఉంటాయి. మెరుపులు, మారుత వాయువులు, సూర్యుడు మొదలైనవి వర్షాలకు సహాయకులుగా ఉంటాయి. పృథివీ అంతరిక్ష ద్యులోకాలకు చెందిన దేవతలును వర్షాలు కురియటానికి సహకారులుగా ఉంటాయి.

22. ఓం **శం నో వాతః పవతాం శంనస్తపతు సూర్యః ।**

**శం నః కనిక్రదద్దేవః పర్జన్యో అభివర్షతు ॥** (య. 36-10)

సరళార్థం: పరమేశ్వరానుగ్రహంతో వాయువు మాకు శాంతి నిచ్చుచూ వీచును గాక! సూర్యుడు మాకు శాంతి కలుగునట్లు తపించును గాక! మా శాంతికై ఉరుములతో కూడిన మేఘాలు వర్షించును గాక!

23. ఓం **ఆపో హిష్ఠా మయోభువస్తా న ఊర్జేదధాతన ।**

**మహే రణాయ చక్షసే ॥** (య. 36-14)

సరళార్థం : జలం నిశ్చయంగా సుఖకారకమైనదే. అది మాకు బలము నిచ్చును గాక! రమణీయ దృష్టిని, దర్శనీయ సౌందర్యమును ఇచ్చును గాక!

24. ఓం **యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః ।**

**ఉశతీరివ మాతరః ॥** (యజు. 36-15)

సరళార్థం : ఈ జలంలో ఏ ఉత్తమోత్తమ రసములు కలవో అవి ఇచ్చుట

ఇప్పుడే మాకు లభించునుగాక! పుత్రుని మేలునుకోరు తల్లివలె అవి మాకు లభించును గాక!

25. ఓం తస్మా అరంగమామ వో యస్య క్షయాయ జన్వథ ।
ఆపో జనయథా చ నః ॥ (యజు. 36-16)

సరళార్థం : జలం గృహారామాది నివాసాలను, మా శరీరాలను శుద్ధిచేసి మాకు ఆరోగ్యాన్ని, తృప్తిని కలిగించును గాక! పుష్కలమైన ఆహార పానీయాదుల నిచ్చును గాక!

26. ఓం శం నో దేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే ।
శం యో రభిస్రవన్తు నః ॥ (యజు. 36-12)

సరళార్థం : దివ్య గుణాలు కలిగిన జలం మాకు సుఖము కలుగునట్లు వర్షించును గాక! అది పానయోగ్యమై మాకు శాంతి నిచ్చును గాక! అనేక సుఖములను వర్షింపచేయును గాక!

27. ఓం ఆపః శివాః శివతమాః శాన్తాః శాన్తతమా స్తాస్తే
కృణ్వన్తు భేషజమ్ ॥ (పారశ్కర గృ. 1-8-5-6)

సరళార్థం : జలం నిజంగా సుఖము నిచ్చునదియే. మేలు చేయువాటిలో అదియే ఉత్తమమైనది. అది శాంతిని కూడా యిస్తుంది. శాంతి నిచ్చు వాటిలోనూ అదియే శ్రేష్ఠమైనది-ఉత్తమమైనది. అట్టి జలం మాకు ఔషధం కూడా అగును గాక!

28. ఓం శం న ఆపో ధన్వన్యా 3 : శము సన్త్వనూప్యాః ।
శం నః ఖనిత్రిమా ఆపః శము యాః కుంభ ఆభృతాః శివా నః
సన్తు వార్షికీః ॥ (అథ. 1-6-4)

సరళార్థం : పరమేశ్వరుని అనుగ్రహంవల్ల లోకంలో మాకు లభించే అన్ని రకాల జలాలు - ఎడారులలోని ఊసరక్షేత్రాలలోని జలాలు, సమృద్ధిగా జలం లభించే స్థానాలలోని జలాలు, బావులలోని చెరువులలోని నదులలోని జలాలు అన్నీ మాకు సుఖమును కలిగించునవియే అగును గాక!

29. ఓం సముత్పతన్తు ప్రదిశో నభస్వతీః సమభ్రాణి వాతజూతాని యన్తు ।
మహఋషభస్య నదతో నమస్వతో వాశ్రా ఆపః పృథివీం తర్పయన్తు॥
(అథ. 4-15-1 నుండి 16 పర్జన్యసూక్తం)

సరళార్థం : మా నిర్మలాకాశం అవసరమైనపుడు మేఘాలతో ఆచ్ఛాదిత మగును గాక! ఋతుపవనాలు మేఘాలను తెచ్చును గాక! ఉరుములు మెరుపులతో కూడి

ఆ మేఘాలు భూమి తృప్తిపడునట్లు వర్షించును గాక!

30. ఓం సమీక్షయన్తు తవిషాః సుదానవో౭ పాం రసా ఓషధీభిః సచన్తామ్ ।
వర్షస్య సర్గా మహయన్తు భూమిం పృథగ్జాయన్తా మోషధయో
విశ్వరూపాః ॥ (అథ. 4-15-2)

సరళార్థం : తృప్తికర వర్షధారలతో పులకితమైన భూమాత మాకు అవసరమైన అన్నిరకాల ధాన్యాలను పండించును గాక! దేశం సుభిక్షమై అన్ని ప్రాణులు ఆనందించును గాక!

31. ఓం సమీక్షయస్వ గాయతో నభాంస్యపాం వేగాసః పృథగుద్విజన్తామ్ ।
వర్షస్య సర్గామహయన్తు భూమిం పృథగ్జయన్తాం వీరుధో విశ్వరూపాః
(అథ. 4-15-3)

సరళార్థం : హే పరమేశ్వరా! నీ కృపవలన బావులు, చెరువులు, నదులు జలపూర్ణము లగును గాక! వివిధ రకాల వృక్షలతాదులు ఫలపుష్ప సంభరితము లగును గాక! జనులు ఆనందంతో నీ యశోగానము చేతురు గాక!

32. ఓం గణాస్త్వోప గాయన్తు మరుతాః పర్జన్య ఘోషిణః పృథక్ ।
సర్గా వర్షస్య వర్షతో వర్షన్తు పృథివీమను ॥ (అథ. 4-15-4)

సరళార్థం : ఓ మేఘమా! ఋత్విక్కులు మధురమైన కంఠస్వరంతో నీ యశోగానం చేతురు గాక! నీవు పులకించి ప్రాణులకు అనుకూలంగా పృథివిపై వర్షింతువు గాక!

33. ఓం ఉదీరయత మరుతః సముద్రతస్త్వేషో అర్కో నభ ఉత్పాతయాథ ।
మహఋషభస్య నదతో నభస్వతో వాశ్రా ఆపః పృథివీం తర్పయన్తు ॥
(అథ. 4-15-5)

సరళార్థం : ఓ మరుత్తులారా (వాయువులారా)! మీరు సూర్యతాపం ద్వారా సముద్రాలలోని నీటిని ఆవిరిగా పైకెత్తి మేఘాలను నిర్మించుచున్నారు. వాటిని ఋతుపవనాల ద్వార భూమిపైకి తీసుకువచ్చి వర్షింపచేయుచున్నారు. పృథివి పులకించి ప్రాణులకు పంటల నిచ్చుచున్నది.

34. ఓం అభి క్రన్ద స్తనయార్దయోదధిం భూమిం పర్జన్య పయసా సమంగ్ధి ।
త్వయా సృష్టం బహులమైతు వర్షమాశారైషీకృశగురేత్వస్తమ్ ॥
(అథ. 4-15-6)

సరళార్థం : ఓ మేఘమా! నీవు అన్నివైపుల నుండి ఉరుముతూ సముద్రాన్ని కుదిపివేయుము. భూమిని నీటితో నింపివెయ్యి. అన్నిప్రాణుల అవసరాలను

తీరుస్తూ వర్షాలను తీసుకు రా! పేద రైతులకు, బక్కపడిన గోసంతానానికి పుష్టితుష్టులను కలిగించు.

**35.** ఓం సంవో౽వన్తు సుదానవ ఉత్సా అజగరా ఉత ।
మరుద్భిః ప్రచ్యుతా మేఘాః వర్షన్తు పృథివీమను ॥ (అథ. 4-15-7)

<u>సరళార్థం :</u> ఓ మానవులారా! మేఘాలు వృష్టిధారలతో మిమ్ము దానశీలురుగా చేయును గాక! మేఘాలవలె మీ అధిక పంటలను దానం చెయ్యండి. ఋతుపవనాలు మేఘాలను అవసరమైన చోటికి తీసుకువెళ్ళి వర్షింప చేయును గాక! (వర్షేష్టి యజ్ఞాల దగ్గరకు ఋతుపవనాలు ఆకర్షింపబడి వస్తాయి).

**36.** ఓం ఆశామాశాం విద్యోతతాం వాతా వన్తు దిశోదిశః।
మరుద్భిః ప్రచ్యుతా మేఘాః సంయన్తు పృథివీమను ॥ (అథ. 4-15-8)

<u>సరళార్థం :</u> ఋతుపవనాలు భూమిపై నలుదిశల వ్యాపిస్తూ అవసరమైన చోటికి మేఘాలను మరలించును గాక! మేఘాలు అవసరమైనచోట (కొండచిలువంత వర్షధారలతో) వర్షించును గాక!

**37.** ఓం ఆపో విద్యుదభ్రం వర్షం సం వో౽వన్తు సుదానవ ఉత్సా అజగరా ఉత । మరుద్భిః ప్రచ్యుతా మేఘాః ప్రావన్తు పృథివీమను ॥

(అథ. 4-15-9)

<u>సరళార్థం :</u> అట్లే, మెరుపులతో కూడిన మేఘాలు అవసరమైనచోట అజగర ధారలతో వర్షించును గాక ! భూమిని తృప్తిపరచును గాక ! (మేఘాలవలె మానవులు కూడా పరోపకారం చెయ్యాలి. అజగరమంటే కొండ చిలువ.)

**38.** ఓం అపామగ్ని స్తనూభిః సంవిదానో య ఓషధీనామధిపా బభూవ ।
సనో వర్షం వనుతాం జాతవేదాః ప్రాణం ప్రజాభ్యో అమృతం దివస్పరి॥

(అథ. 4-15-10)

<u>సరళార్థం :</u> సూర్యతాపం విశేషంగా జలాలను తాకుతూ వివిధరకాల ధాన్యాలను విస్తృతంగా పండించును గాక! పంటలను ఉత్పన్నం చేయుచూ మరియు వాటిని మరింత గుణవంతం చేయుచు, అవసరమైనపుడంతా మేఘాలను వర్షింపచేస్తూ సూర్యకిరణాలు ప్రాణికోటికి జీవనదానం చేస్తూఉండు గాక!

**39.** ఓం ప్రజాపతిః సలిలాదా సముద్రాదాప ఈరయన్నుదధిమర్దయాతి ।
ప్రప్యాయతాంః ॥ వృష్ణో అశ్వస్య రేతో౽ర్వాజేతేన స్తనయిత్నునేహి ॥
(అథ. 4-15-11)

సరళార్థం : ప్రజాపాలకుడైన సూర్యుడు ద్యులోక సముద్రాన్నుండి మేఘాల ద్వారా నీటిని పంపుతూ భూలోక ప్రాణులకు మేలుచేయుచుండును గాక! ఓ మేఘమా! నీవు గర్జించుచు మా చెంతకు రమ్ము.

40. ఓం ఆపో నిషించన్నసురః పితా నః శ్వసన్తు గర్గరా అపాం
వరుణావ నీచీరపః సృజ, వదన్తు పృశ్నిబాహవో మండుకా ఇరిణాను ॥

(అథ. 4-15-12)

సరళార్థం : ప్రాణదాతవైన ఓ మేఘమా! ఊసరక్షేత్రాలలో అజగరధారలతో వర్షించి అచటి ప్రాణులకు జీవనాన్ని ప్రసాదింపుము. మండూకాలకు (కప్పలకు) ఆహ్లాదాన్ని కలిగించుము.

41. ఓం సంవత్సరం శశయానా బ్రాహ్మణా వ్రతచారిణః ।
వాచం పర్జన్య జిన్వితాం ప్ర మండూకా అవాదిషు ॥ (అథ. 4-15-13)

సరళార్థం : ఓ వేద విద్వాంసులారా! పర్జన్యముచే తృప్తులైన మండూకాలు మౌనం విడిచి ఆనందరాగాలాపాలు చేసినట్లు మీరును మౌనం విడిచి మీ జ్ఞానాన్ని గానం చేయండి - ఇతరులకు వినిపించండి.

42. ఓం ఉపప్రవద మండూకి వర్షమా వద తాదురి ।
మధ్యే హ్రదస్య ప్లవస్వ విగృహ్యా చతురః పదః ॥ అథ. 4-15-14)

సరళార్థం : ఓ వేద విద్వాంసులారా! వర్షాలతో పూర్ణములైన జలాశయాలలో మండూకాలు నాలుగుకాళ్లతో నలుదిశల ఈతలు కొట్టుచూ ఆనందంతో విహరించునట్లు మీరును వేదవిద్యాపూర్ణులై లోకంలో నలుదిశలా తిరుగుచూ దైవవాణిని (వేదవాణిని) వినిపించండి.

43. ఓం ఖణ్వఖా3ఇ ఖైమఖా3ఇ మధ్యే తదురి ।
వర్షం వనుధ్వం పితరో మరుతాం మన ఇచ్ఛత ॥ (అథ. 4-15-15)

సరళార్థం : ఓ మూడు రకాల (ఖన్వఖా, ఖైమఖా, తదురీ) విద్వాంసులారా! ఏ విధంగా వర్షతృప్తి చెందిన మండూకాలు జలాశయాలలో ఆనందంగా విహరిస్తాయో మీరును అట్లే జ్ఞాన కర్మ ఉపాసనా విషయాలను బోధిస్తూ లోకంలో విహరించండి.

44 ఓం మహాన్తం కోషముదచాభి షించ సవిద్యుతం భవతు వాతు వాతః ।
తన్వతాం యజ్ఞం బహుధా విసృష్టా ఆనందినీరోషధయో భవన్తు॥

(అథ. 4-15-16)

సరళార్థం : హే పరమేశ్వరా! నీ సృష్టి పరమాద్భుతం. సూర్యతాపంతో

సముద్రాలలోని నీటిని నీటికోశాలుగా (మేఘాలుగా) చేయుచున్నావు. ఋతుపవనాల ద్వార ఆ మేఘాలను భూమిపైకి తీసుకువచ్చి వర్షింప చేయుచున్నావు. అందువల్ల వివిధరకాల పంటలుపండి ప్రాణులన్నీ ఆనందంతో జీవిస్తున్నాయి. నీ పాలన పోషణ ఏర్పాట్లు ప్రశంసనీయాలు.

**45 ఓం కృష్ణం నియానం హరయః సుపర్ణా అపో వసానా దివముత్పతన్తి ।**
**తా ఆవవృత్రన్త్సదనా దృతస్యాదిద్ ఘృతేన పృథివీం వ్యూదుః**

(అథ. 6-22-1)

<u>సరళార్థం :</u> సూర్యకిరణాల వేడితో భూమిపైన, సముద్రాలలోను ఉన్న నీరు సూక్ష్మంగా ఆవిరవుతూ పైకెగిరి మేఘాలుగా నగుచున్నది. చల్లని గాలివల్ల మేఘాలలోని నీరు వర్షంగా భూమిని చేరుచున్నది. ఓ మానవులారా! ఈ జలచక్రాన్ని అర్థం చేసుకోండి.

**46. ఓం పయస్వతీః కృణుథాప ఓషధీః శివా యదేజథా మరుతో రుక్మవక్షసః ।**
**ఊర్జం చ తత్ర సుమతిం చ పిన్వత యత్రా నరో మరుతః సించథా మధు॥**

(అథ. 6-22-2)

<u>సరళార్థం :</u> ఓ మరుత్తులారా (వాయువులారా) ! మీరు సువర్ణ సమములైన సూర్యకాంతులతో కూడి భూమిపైనున్న జలాన్ని పైకి తీసుకుపోవుచున్నారు. మేఘాలుగా మారిన ఆ నీటిని మీరు ఏ ఏ ప్రాంతాలకు తీసుకువెళ్ళి వర్షింప చేస్తారో ఆ యా ప్రాంతాలు ప్రాణులకు పుష్టిని, శక్తిని యిచ్చే పంటలతో కళకళ లాడుతూ ఉంటాయి. ఓ మరుత్తులారా! మీరు పుష్టితో బాటు సుబుద్ధిని కూడా యివ్వండి.

**47. ఓం ఉదప్రుతో మరుతస్తాం ఇయర్త వృష్టిర్యా విశ్వానివతస్పృణాతి ।**
**ఏజాతిగ్లహా కన్యేవ తున్నైరుం తుందానా పత్యేవ జాయా ॥** (అథ. 6-22-3)

<u>సరళార్థం :</u> ఓ ఋతుపవనములారా! మీరు మేఘాలను ప్రేరేపించి భూమిపైకి తీసుకువచ్చి వర్షింపచేయండి. మా నదులు, వాగులు, వంకలు, తటాకాలు, బావులు అన్నీ జలపూర్ణాలు చేయండి.

**48. ఓం సస్రుషీస్తదపసో దివా నక్తం చ సుస్రుషీః ।**
**వరేణ్యక్రతు రహమపో దేవీ రుపహ్వయే ॥** (అథ. 6-23-1)

<u>సరళార్థం :</u> ఉత్తమ కర్మలు చేయు నేను ద్యులోకంలో వ్యాపించియున్న నీటిని లోక కళ్యాణం కొరకు దినరాత్రులందు సాదరంగా ఆహ్వానిస్తున్నాను.

**49. ఓం ఓతా ఆపః కర్మణ్యా ముంచన్త్వితః ప్రణీతయే ।**

సద్యః కృణ్వంత్వేతవే ॥ (అథ. 6-23-2)

సరళార్థం : విస్తృతంగా వ్యాపించియున్న పరమేశ్వరుని దివ్యశక్తులను వర్షం కొరకు ప్రార్థించుచున్నాను. నా ప్రార్థనల నాలకించి ప్రాణుల దుఃఖ విముక్తికి అవి సత్వరం వర్షాన్ని తెచ్చును గాక!

**50. ఓం దేవస్య సవితుః సవే కర్మ కృణ్వన్తు మానుషాః ।**
**శం నో భవన్త్వప ఓషధీః శివాః ॥** (అథ. 6-23-3)

సరళార్థం : మానవులంతా దివ్యగుణయుక్త సర్వవ్యాపక సర్వేశ్వరుని శాసనంలో ఉంటూ వేదవిహిత యజ్ఞాలను సదా ఆచరింతురు గాక! వాటితో మాకు మేలుచేసే ఆహార ఔషధాదులన్నీ పుష్కలంగా లభించును గాక!

**51. ఓం హిమవతః ప్రస్రవన్తి సింధౌ సమహ సంగమః ।**
**ఆపో హ మహ్యం తద్దేవీర్దదన్ హృద్ద్యోత భేషజమ్** ॥ (అథ. 6-24-1)

సరళార్థం : సూర్యతాపంతో హిమవత్ పర్వతాలనుండి స్రవించు జలధారలు మా భూములపైనుండి ప్రవహించి సముద్రంలో కలియును గాక! ఆ పరిశుద్ధ ధారలు మాకు ఔషధములను తెచ్చును గాక! వాటితో మా హృదయాలు ప్రసన్నమగును గాక!

**52. ఓం యన్మే అక్ష్యోరాదిద్యోత పార్ష్ణ్యోః ప్రపదోశ్చ యత్ ।**
**ఆపస్తత్సర్వం నిష్కరన్ భిషజాం సుభిషక్తమాః** (అథ. 6-24-2)

సరళార్థం : పరమేశ్వరుడు సృజించిన ఆ జలధారలు నా నేత్రాలను, చీలమండలను, పాదాలను స్వస్థపరచును గాక. వైద్యులలో అత్యుత్తమ వైద్యుడైన పరమేశ్వరుడు మా వ్యాధులను నివారించును గాక!

**53. ఓం సింధుపత్నీః సింధురాజ్ఞీః సర్వా యా నద్యస్తన ।**
**దత్తనస్తస్య భేషజం తేనా వో భునజామహై ॥** (అథ. 6-24-3)

సరళార్థం : నదులు సింధుపత్నులనీ, సముద్రపత్నులనీ, సింధురాణులనీ కీర్తింపబడతాయి. అట్టి ఆ నదులు మమ్ముబాధించు రోగాలకు ఔషధాలను తెచ్చును గాక!

**54. ఓం ప్ర నభస్వ పృథివి బీంద్ధీ3దం దివ్యం నభః ।**
**ఉద్నో దివ్యస్య నో ధాతరీశానో విష్యా దృతిమ్ ॥** (అథ. 7-18-1)

సరళార్థం : ఓ భూమాతా! నీవు చక్కగా నాగలితో దున్నబడుదువు గాక! హే పరమేశ్వరా! నీవు ఈశానుడవు - సర్వసమర్థుడవు. ఆకాశస్థ మేఘాన్ని చిన్నాభిన్నంచేసి వర్షింప జేయుము.

చిన్నాభిన్నంచేసి వర్షింప జేయుము.

**55. ఓం నఘ్రంస్తతాప న హిమో జఘాన ప్ర నభతాం పృథివీ జీరదానుః ।**
**ఆపశ్చిదస్మై ఘృతమిత్ క్షరన్తి యత్ర సోమః సదమిత్తత్ర భద్రమ్ ॥**

**(అథ. 7-18-2)**

సరళార్థం : హే ప్రజాపతివైన పరమేశ్వరా! ప్రచండ సూర్యతాపం మమ్ము ఎక్కువగా బాధించకుండును గాక! అట్లే శీతమునూ మమ్ము బాధించకుండును గాక. అంతరిక్షస్థ జలము చక్కగా వర్షమై క్రింద పడును గాక! ఆ జలధారలే పృథివికి ఘృతము, బలము. ఎచట పుష్కలంగా సోమాది పంటలు పండునో అచట ప్రాణులన్నిటికి మేలు జరుగును.

**56. ఓం దివ్యం సుపర్ణం పయసం బృహన్తమపాం గర్భం వృషభమోషధీనామ్।**
**అభీపతో వృష్ట్యా తర్పయన్తమా నో గోష్ఠే రయిష్ఠాం స్థాపయాతి ॥**

**(అథ. 7-39-1)**

సరళార్థం : దివ్యగుణయుక్తుడైన సుపర్ణుడు (సూర్యుడు) విశాల ఆకాశస్థ గర్భమువలె భాసించు మేఘాన్ని తపింపచేసి వర్షింపచేయును గాక! ఆ వర్షధారలు పృథివిని తృప్తిపరచును గాక! గోవులు క్షీరధారలతో మమ్ము తృప్తి పరచును గాక!

**57. ఓం యస్య వ్రతం పశవో యన్తి సర్వే యస్య వ్రత ఉపతిష్ఠన్త ఆపః ।**
**యస్య వ్రతే పుష్టపతిర్నివిష్టస్తం సరస్వన్త మవసే హవామహే ॥**

**(అథ. 7-40-1)**

సరళార్థం : ఎవని వ్రత నియమాల ననుసరిస్తూ పశుపక్ష్యాదులన్నీ విహరించుచుండునో, వివిధ జలములుండునో, పోషించు సూర్యుడుండునో అట్టి సర్వేశ్వరుని వర్షాభావంతో పీడింపబడుచున్న మా రక్షణ కొరకు ఆహ్వానించు చున్నాము.

**58. ఓం శం త ఆపో హైమవతీః శము తే సంతూత్స్యాః ।**
**శం తే సనిష్యదా ఆపః శము తే సన్తు వర్ష్యాః ॥**

**(అథ. 19-2-1)**

సరళార్థం : హే పరమేశ్వరా! నీ కృపవలన మంచుపర్వతాలనుండి ఉత్పన్నమైన జలం మాకు శాంతి నిచ్చును గాక! అట్లే, బావులలోని నీరు, నదులలో ప్రవహించు నీరు, వర్షజలము అన్నీ మాకు శాంతి దాయకములే అగును గాక! (వాటిని కలుషితం కాకుండా కాపాడుకోవలసిన బాధ్యత మనపై ఉంది -

59. ఓం శం త ఆపో ధన్వన్యా3ః శం తే సన్త్వనూప్యాః
శం తే ఖనిత్రిమా ఆపః శం యాః కుంభేభిరాభృతాః ॥

(అథ. 19-2-2)

సరళార్థం : ఎడారులందలి ఓయాసిస్సుల నీరు, సముద్ర తీరప్రాంతాల లోని నీరు, బావులలోని నీరు, బిందెలలోని కుండలలోని నీరు అన్నియు మాకు శాంతి దాయకములే అగును గాక!

60. ఓం అనభ్రయః ఖనమానా విప్రా గంభీర్మే అపసః ।
భిషగ్భ్యో భిషక్తరా ఆపో అచ్ఛా వదామసి ॥ (అథ. 19-2-3)

సరళార్థం : ఓ మానవులారా! మీలో విద్వాంసులు, గంభీర పరిశోధకులు, వైద్యులలో ఉత్తమ వైద్యులు, విజ్ఞాన వేత్తలు వివిధ జలాలలోని రోగనివారణ గుణాలను కనిపెట్టి లోకంలో ప్రచారం చేయదురు గాక !

61. ఓం అపామహ దివ్యానామపాం స్రోతస్యానామ్ ।
అపామహ ప్రణేజనేఽశ్వా భవథ వాజినః ॥ (అథ. 19-2-4)

సరళార్థం : ఓ మానవులారా! మీరు వర్షజలముల, ఊటల జలముల, సెలయేరుల జలముల, నదుల జలముల గుణ గణాలను తెలుసుకొని ఆ యా అవసరాల కుపయోగించుకుని ఆరోగ్యాన్ని, బలాన్ని పొందండి. వ్యవసాయాదులను చేసి పుష్కలమైన ధనధాన్యాలతో వర్ధిల్లండి.

62. ఓం తా ఆపః శివా అపోఽయక్ష్మం కరణీరపః ।
యథైవ తష్యతే మయస్తాస్త ఆ దత్త భేషజీః ॥ (అథ. 19-2-5)

సరళార్థం : ఓ మానవులారా ! (పరమేశ్వర ప్రదత్తములైన) మంగళకరమైన జలాలను గురించి, రోగనివారక జలాలను గురించి, దారిద్ర్య భయ నివారక జలాలను గురించి చక్కగా తెలుసుకొనండి. ఇవి మీకు ఎన్నెన్నో సుఖాలను ప్రసాదిస్తాయి.

(వర్షేష్టి సూక్తం సమాప్తం)

అనంతరం 24వ పేజీలో గల యజ్ఞానంతర ప్రార్థన చెయ్యాలి. తదుపరి అవకాశాన్ని బట్టి విద్వాంసుల ఉపదేశాలుంటాయి. చివరలో శాంతిపాఠ మంత్రం పఠించాలి.

## ముగింపు మాటలు

ప్రియ పాఠకులారా !

మనం ఇంతవరకు వేదాలలోని వర్షేష్టి విజ్ఞానం గురించి, విధి విధానాలను గురించి, అర్థసహితంగా వర్షేష్టి మంత్రాల గురించి తెలుసుకున్నాము. అథర్వవేదంలో 12వ కాండంలోని మొదటి సూక్తం 'పృథివీ సూక్తం' అనే పేరుతో 63 మంత్రాల పెద్ద సూక్తం ఉంది. వాటితోనూ ఆహుతులివ్వవచ్చు. దానిని మా గురుదేవులు పం. గోపదేవశాస్త్రి గారు తెలుగులో అర్థతాత్పర్యాలతో ప్రచురించారు. అది ఆర్యసమాజము, కూచిపూడిలోను మాశెట్టి వారు సికింద్రాబాద్‌లోను దొరుకుతుంది. సమయాన్ని, యజ్ఞకర్తల శ్రద్ధాభక్తులను బట్టి యజ్ఞక్రియను పొడిగించవచ్చు.

ఈ వర్షేష్టి ఒక వ్యక్తి లేదా ఒక కుటుంబ ప్రయోజనానికి కాక సమిష్టికి-కొన్ని గ్రామాల ప్రయోజనానికి తోడ్పడుతుంది. యజ్ఞంవల్ల సర్వప్రాణులకు మేలు కలుగుతుంది. ఒకవేళ కాలుష్యకారణంగా గాని, మరేదైనా అవాంతర కారణంవల్లగాని వెంటనే వర్షం పడకపోయినా కొంత ఆలస్యంగా పడుతుంది. మనం ఆహుతులుగా అర్పించిన పదార్థం వ్యర్థంకాదు. నష్టంకాదు. ఆ యా పదార్థాలు, ఆహుతులు సూక్ష్మాణువులుగా మారి గాలిలో కలుస్తాయి కనుక ఆ గాలిని పీల్చుకున్న సమస్త చరాచర ప్రాణికోటికి అవి ఆరోగ్యాన్ని, పుష్టిని కలిగిస్తాయి. వాతావరణంలోని కాలుష్యాలను విరిచివేస్తాయి. కొంతభాగం మేఘాలలోనికి పోయి వాటిని శుద్ధి చేస్తుంది. అవి వర్షించినపుడు తిరిగి భూమిని చేరి భూమిని శుద్ధి చేస్తుంది. అది ఎరువుగా మారి వృక్షజాతులను వృద్ధిచేస్తుంది. ఈ విధంగా యజ్ఞంలో వేసిన పదార్థలు చక్రభ్రమణం చేస్తాయేకాని వ్యర్థంకావు.

యోగేశ్వర శ్రీకృష్ణుడేమన్నాడంటే -

**"శ్లో. అన్నాద్ భవంతి భూతాని, పర్జన్యాదన్న సంభవః ।**

**యజ్ఞాద్ భవతి పర్జన్యో, యజ్ఞః కర్మ సముద్భవః ॥** - భగవద్గీత (3-14)

పరిశీలించి చూస్తే - అన్నం వల్లనే ప్రాణులు జీవిస్తున్నాయి. అన్నం మేఘాలు వర్షించటంవల్ల ఉత్పన్నమౌతున్నది. మేఘాలు యజ్ఞాలవల్ల ఏర్పడుతున్నాయి. యజ్ఞాలు మానవులు చేసే కర్మవల్ల-పూర్ణ పురుషార్థంవల్ల సంపన్నమౌతాయి" అన్నాడు.

కనుక మనం సృష్టికర్త నుండి వచ్చిన వేదజ్ఞానంతో వర్షేష్టి యజ్ఞాలు చేసి మనవంతు ప్రయత్నం మనం చేద్దాము.

**శ్లో॥కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।**

**దేశోఽయం క్షోభరహితః సజ్జనాస్సంతు నిర్భయాః ॥**

ఓ3మ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స (40-00), వేదాలలో జలచికిత్స (20-00), వైదిక క్రాంతి పథం (15-00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము (15-00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణిస్త్రీ) (30-00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20-00), గర్భధాన విజ్ఞానము (30-00), మానవ ధర్మము (25-00), అశ్వినీ దేవతలు (20-00), సంధ్యా వందనము - వైజ్ఞానిక సమాలోచనము (20-00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30-00), గంగాధర శివుడు (5-00), గోమాత (30-00), గాయత్రీ విజ్ఞానం (50-00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60-00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (10-00), దైనిక అగ్నిహోత్రవిధి (4-00), మన ఇతిహాసం (70-00), మన వేదశాస్త్రాల పరిచయం (50-00), చతుర్దశ భువనములు (10-00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10-00), యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8-00), ధర్మవీర్ పం. లేఖరామ్ (3-00), వేదాలలో అప్సరస గంధర్వులు (2-50), యజ్ఞోపవీత వైశిష్ట్యము (2-00), లక్ష్మీ సూక్తము (2-00), శాంతి ప్రార్థన (2-00), దగ్రేట్ గాయత్రి (2-00), వైదిక అర్థనీతి (2-00), స్వరాజ్య సంగ్రామంలో ఆర్యసమాజము (8-00), సత్యధర్మవిచారణ (6-00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10-00), మరణానంతరం జీవుని ప్రయాణము (40-00), ప్రణవ స్తోత్రం (10-00), అహల్యా రాయిగా మారలేదు (2-00), దయానందుని ఆదర్శరాజ్యం (1-00), మాతాపుత్రికల జ్ఞానచర్చ (60-00), వేదాల వెలుగు చూపే ఆర్యసమాజము (20-00), చతుర్వేద సరస్వతీ సూక్తము (10-00), పురుష సూక్తము (20-00), వేదాలలో వర్షేష్టి విజ్ఞానం (25-00) ఈశావాస్యమిదం సర్వమ్ (35-00), వైదిక శాంతిపాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) (20-00), పండుగల పరమార్థం (40-00).

Gayatri Series : 59

**VEDALALO VARSHESHTI VIGNANAM**

**Rs. 25/-**



# సృష్టికర్త సందేశం

ఉత్తిష్ఠ బ్రహ్మాణ స్పతే దేవాన్ యజ్ఞేన బోధయ ।
ఆయుః ప్రాణం ప్రజాం పశూన్ కీర్తిం యజమానం చ వర్ధయ ॥

అథర్వవేదం (19-63-1)

ఓ వేద విద్వాంసులారా ! బద్ధకమును విడిచి లెండి, మేల్కొనండి. ప్రజలచే యజ్ఞాలను చేయించి పృథివ్యాపస్తేజోవాయురాకాశాది దేవతలను తృప్తిపరచండి. తద్వారా యజ్ఞకర్తలకు దీర్ఘమైన ఆయువును, బలమైన ప్రాణశక్తిని, ఉత్తమ సంతానాన్ని, గో అశ్వాది పశు సంపదలను కలిగించండి. వారిచే మరిన్ని సత్కర్మలు చేయించి కీర్తి ప్రతిష్ఠలను కలిగించండి. లోకానికి మేలు చేయండి.

**0 Masters of Vedic Speech! Please rise to excellence and inspire awakening in the men of wisdom and virtue through the performance of YAJNA. You strengthen the performer of Yajna (యజమాని) and give an aid to life, vital breath, children, cattle and fame.**

Published by :

**GAYATRI ASHRAM TRUST**

12-10-586/6, Arya Samaj, Vyas Nagar,
Medibavi, Warasiguda, Secunderabad - 500 061. (Telangana)